    

# రామానుజ విన్నపములు



శ్రీ రంగనాయకులు స్వామివారు

పూర్వకవి ప్రణీతము.

ప్రకాశకులు:

నిడుముక్కల సుబ్బారాయుడు,

విజయవాడ.

వెల రు. **0-8-0**



# శ్రీ ఆండాళమ్మవారు

## శ్రీయతిరాజ సేవా మహిళామండలి

అధ్యక్షులు: K. తాయారమ్మ,

సెక్రటరీ: P. రంగనాయకమ్మ,

విజయవాడ-1.

ఈపుస్తకము ముక్త్యిపల్లి అగ్రహార వాస్తవ్యులు శ్రీమాన్ పణిహారం సముద్రాల తిరువెంగళాచార్యులవారి శిష్యులు నిడుముక్కల పిచ్చయ్య, మహాలక్ష్మమ్మగారల కుమారుడు సుబ్బారాయుడుగారి ద్రవ్యసహాయముచే సచ్ఛాత్రింప బడినది. కావలసిన వారికి ఉచితముగా సమర్పింపబడును.

నిడుముక్కల సుబ్బారాయుడు, విజయవాడ.

శ్రీమతేరామానుజాయనమః



# రామానుజవిజ్ఞాపనములు.

గార్గేయ వేంకటాచార్య పాదపంకేరుహాశ్రయః।
జ్ఞానవైరాగ్యసంపన్నం రామానుజగురుంభజే॥

శ్రీవైకుంఠనాథహృద్యస్వరూపా । గుణానంతంబులచేత ననంతుండవనియును । ప్రాప్తజ్ఞానబలసంపన్నతచేత నివాసశయ్యాసన పాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః ఇత్యాది శరీరభేదంబుల శ్రియఃపతిః దత్తవనరోచితశ్శేష శేషభావంబులొందిన కతంబున శేషుండవనియును । ప్రఖ్యాతి గాంచిన నిత్యసూరివర్గప్రధానుండై యితరుల నెలసి యశేషప్రాచీనదేశికాశయసిద్ధ్యక్రమంబున జ్ఞానిత్వాత్మైవమే మతమిత్యుక్తసకలజ్ఞానశబ్దంబునకర్థంబువై యాటచేత భగవద్దర్శనంబులెల్ల నీయంతరాత్మభూతనవత్పర్యంత పర్యవసానంబు లేమువ్వగాన । సంతతోత్సవంబులు సంతతమంగళంబులును దేవర వారికే ఘటించె । మేలు మేలు మమ్మేలు శేషనగరాధినాథా రామానుజా నమోనమో యతిరాజశేఖరా॥ ... ... ... (౧)

ఉభయవిభూతినాయకా । మీ దివ్యస్వరూపంబునకు వ్యాప్త్యైశ్వర్యంబు । మీ దివ్యస్వరూపంబునకనవధిక మంగళంబు । మీదివ్యగుణంబులకనంత ప్రకాశంబు । మీదివ్యవిభూతులకపారసమృద్ధి । మీదివ్యసంకల్పంబునకనంతరాయపూర్వకసంసిద్ధి । మీదివ్యసూక్తులకతులిత కౌశలంబు । మీదివ్యచేష్టితంబులకభ్యుదయపరంపరాభివృ

ద్ధి । మీదివ్యమహిమకనధికాతిశయవిభవంబు । మీదివ్యకీర్తికఖండ బ్రహ్మాండమండలవ్యాప్తి । మీదివ్యాజ్ఞకవంకుశ పరాక్రమస్థైర్యంబు మీదివ్యచరణారవింద సేవకవర్గంబునకనర్గళజ్ఞానభక్తివైరాగ్య సంపదానందావాప్తులంగోరెద యేమిటికిఁగోరెదనంటేని విన్నవించెద। అశేష చిదచిద్వర్గంబు ప్రమేయంబైన బ్రహ్మాండంబునకధీనంబు । ప్రమేయంబు ప్రమాణాధీనంబు । ప్రమాణంబు ప్రమాతృఅధీనంబు నీవు ప్రమాతాగ్రేసరుండవుగనుక । లెస్సవిచారించిచూడ నీలెస్సయే ప్రకారిప్రకారభూతప్రపంచబ్రహ్మలలెస్సకు మూలంబయ్యెఁగావున ప్రార్థించితి చిత్తగించుమీ । శేషనగరాధినాథ రామానుజ నమోయతిరాజ శేఖరా॥ ... ... ... ... ... ... (౨)

ఆచార్యలక్షణలక్షితా । నీవు భగవత్ప్రపన్నులకు ఘటకభావంబుగ వహించుచు । సర్వోపాయశూన్యులకు స్వయమేవోపాయభావంబు వహించుచు । చేతనోజ్జీవనహేతువైనవాడవు । అందొకటిలక్ష్మీ ధర్మంబు । వేరొకటినారాయణధర్మంబు । ఈరెండుధర్మంబులుమీయందేకానుపించిన కతంబున ధర్మంబులు ధర్మివ్యతిరిక్తమై యుండవు గావున । వారిరువురు నీరూపంబుననే యేకవ్యక్తియౌట సిద్ధంబు । రాఘవత్వేభవేత్సీతారుక్మిణీకృష్ణజన్మని అనువిధమున నవతారాంతరంబులందుంబలెనే భిన్నవ్యక్తులైనను । శ్రీసన్నిధానంబున్నచోట కాకరుక్మిప్రభృతులగతి చేతనులు సాపరాధులయ్యును జీవింపుదురు। తత్సన్నిధానంబుదొరకనియెడల రావణకంసాదులచందంబున నశించిపోదురుగదాయనివిచారించి యేకవ్యక్తిమాట । ఈయర్థంబు దేవరకుబరమాంతరంగుండైన భాగినేయుండగు దాశరథినూరి యుపన్యసించెగావున । మంత్రరత్నంబున కర్థంబునీవేయని తెలిసి శరణంటి రక్షించుమీ । శేషనగరాధినాథరామా॥ ... ... (3)

శ్రీరంగేశవిజయధ్వజా । మిమ్ము విష్వక్సేనులుగా నూహించి అవిఘ్నపరిసమాప్తికొఱకు । కృతిముఖంబుల నారాధించినాడ । అదియెట్లన్నగా వేరీవిరజాప్రణవాకార వేదశృంగరంగవిమానంబే వైకుంఠ మందిరంబు । తన్నివాసియె వాసుదేవుండనుటచేత ప్రత్యక్షపరమపదంబు రంగస్థలంబనుట సకలలోకప్రసిద్ధంబు । అచట నీవిష్వక్సేన ముద్రయగు నేత్రంబు హస్తంబునబట్టి తత్కైంకర్యంబులెల్ల దిద్దుట

యును । తత్పర్యాయంబులగు దివ్యదేశంబులందెల్లనీయాజ్ఞ చెల్లించు
టయును సాక్షిగాగ ప్రత్యక్షంబునకు ప్రమాణమేల । కావున నిన్ను
ప్రార్థించి నంత నవిష్వక్సేన ప్రార్థనమాల ప్రైవితర్కించుమిరా । శేషనగ
రాధి॥ ... ... (౪)

శ్రీభావ్యకారా । ఉభయపక్షంబుల ద్విజవరులెందరెందఱికి
నీవ్రహాత్రిగురు । ఉభయవరై బహువిధ వేదశాఖలెల్లనీకు వాఙ్ముఖ విధే
య బగుటం తే । త్రిదండమయియుండవనంబరగుచు । కాషాయవస్త్రో
త్తరీయాభరణిత స్వర్ణవర్ణశరీరంబును । ధవళమృన్మయోర్ధ్వపుండ్ర
విరాజితవదనమండలంబును । విస్ఫారిత స్ఫటికభోగభోగోపమానజల
వారణాంచిత అగ్రభాగ త్రిదండగ్రాహికరంబునుగల్గంజూచినీవు సాక్షా
ద్వైన తేయుండవని సేవించితిగాదె శ్రియఃపతి అనంతశయన పురుషో
త్తమస్థలంబుననుండి కృత ప్రతికృత న్యాయంబున నిన్నుగురంగకూ
ర్మస్థలంబులందుసల్పి నీవు విష్వక్సేనుండవగుట జగద్విదితంబుచేసునా ।
శేషనగరాధినాథ రామానుజానమోయతిరాజశేఖరా॥ ... (౫)

శ్రీనిధిశ్రీపదా । నీవు కల్యాణగుణకలశాంబురాశివనీయందు
త్పన్నంబగుసద్విద్యోపన్యాసరూపంబైన వేదార్థ సంగ్రహంబును।
అమృతంబులసురవర్గంబుతు పాలికిదప్పిభూసురవరుల పాలికివచ్చె । నీవ
లననలమేల్మంగాభిధానలక్ష్మివి శేషాచలనివాసుండగుహరిపరిగ్రహించి
శ్రీమంతుండై తన శ్రీనివాసనామంబు యథార్థంబుచేసుకొనెగావున।
నీవుపాలమునీన్నటిచందంబున నతనికిమామవైతివి । అతండు తొండ
మాన్ చక్రవర్తికి దనశంఖచక్రంబులిచ్చిమగుడియెవ్వరిచేత గైకొ
నక । నీవుపంచాయుధాత్మకుండనియెడి తెలివిచేత నీయవతార
సమయంబున కెదురుచూచుచు । నీచేతనే శంఖచక్రంబులందు
కొనియె నీపంచాయుధాత్మకత్వంబు రంగామృతకవీంద్రుండు సమక్ష
మంబున నీచేత నియొప్పించె । ఇట్లు ప్రసన్నగాయత్రీ వేత్త లెఱుంగుదురు
గనుక పరాంకుశగారు నిన్నుసన్నుతించుచో పంచాయుధంబుల సన్ను
తించుటసుమీ అమేయవైభవా । శేషనగరాధినాథరామానుజా
నమోయతిరాజశేఖరా॥ ... ... (౬)

యదుశైలనాథజనకా । తొల్లినీవు రామప్రియులనిమిత్తమున
యాదవాచలంబువెడలి ఢిల్లీనగర పర్యంతంబు దండుచేసితోడ తెచ్చి

పూజార్హునింజేసి నిత్యోత్సవప్రముఖసకలవిధకైంకర్యంబు లొనరిం
పంజూచి । ఆచెల్వపిళ్ళయందుకు సదృశ ప్రత్యుపకారంబు సేయఁగలనే
యనివిచారించి నిన్నుఁ జనకునిగావరించి తానియతిరాజసంపత్కుమా
రుండవనుకొని నీకుసర్వప్రకార పరతంత్రుండయి నీవు నియమించిన
పనులెల్లజేసి చెల్లింపుచు । అంతట దృష్టిపొందక సర్వజ్ఞకృతజ్ఞత్వాది
గుణనిధిగనుక । నీ వేకర్గవశంబున నైనారురూపంబు గైకొనుటగనుం
గొని । ఆమహిమఁ బ్రకాశింపఁదలంచినవాఁడై । తమపని ధిల్లీ ద్వతీయ
వస్తులిరువురువచ్చి । పాపాచారంబుపరిహరముగదా బ్రహ్మనియడిగిన ।
అది శ్రీవైష్ణవమూలంబుగారావలయు । మీరుఁ తిరుఁతికరిగిఅచటవసి
యించియుండు పరవస్తునైనారునాశ్రయించి చీటిదెండిచ్ఛేదననిన వారు
నటులఁ తెన్నేవచ్చినైనారును సేవించి తద్వృత్తాంతంబువిన్నవించి సంవ
త్సరపర్యంతంబును వర్తనంబుజేసియు ॥ తామప్రసన్నీకరించలేక
పరవస్తునైనఅప్పాన్ పిళ్ళయనుఁ తనికివిన్నపంబు జేసిన అమహాత్ముఁడు
పురుషీకరించగానాశ్రయించి చీటిప్రాయించిపుచ్చుకొని మగుడి తిరు
నారాయణపురంబునకువచ్చి చెల్వపిళ్ళయన్నిధనాచీటిసమర్పించినదయు
రాజముడిలోఁజేర్చి శిరసావహించి । వారికివారికైనబంధువులకును
న్నూటికిఁగూడ బకముపదంబిచ్చెనట నైనారుమీయుపకారంబే కాక
యుండినఅతనింతయాడుపడు డెట్లు । అట్టిదేశికవరుని సంబంధంబు
తత్సంబంధపరంపరాముఖంబుగలవాఁడనుగనుక వీఁడు మాసంబంధుఁడే
యని విచారించిగదా నన్ను నీవు పరిగ్రహించితివి । నామనోవాక్కా
యవృత్తులు నీకే శేషంబుజేసుకొంటివి । నేబోవుపోకలెల్ల ముద్దుజేసు
కొంటివి । నీయాశ్రితవత్సలత్వంబెంతవర్ణింతు నే శేషనగరాధ॥ (౨)

అమితకీర్తి । వేయిముఖంబులు రెండువేలజిహ్వలుగల అది
శేషుండవటనీవు । దేవగంధర్వకిన్నరగణంబులకు నీగుణంబులిన్ని
గణింపశక్యముగాదట ॥ ఇట్టిసన్నేకవక్త్రుండ నేకజిహ్వుండ । మానవ
మాత్రుండనైన నేనిన్ను సన్నుతించదలంచుటచాలాలజ్జావిహీనకృత్యం
బేయౌను । అయినగానిమ్ము నాకొకబలిమిగలుగవిచారించి యారం
భించినాఁడను । అదెట్లన్న శారద నీకత్యంతవశంవదతదామోదసం

పాదకంబు భవదీయస్తవంబుగావున । నిన్ను సన్నుతించ మతి నెంచిన
చో దత్సహాయంబు నాకనర్గళముగా గలదని సుమీ । శేషనగరాధి
నాథ॥ ... .... ... (౭)

అస్మత్స్వామీ । అవిదితదేవతాంతరవృత్తిని । నీకు శేష
మైనవాడను । శేషవస్తుస్వరూపంబు పదార్థమై స్వానన్ మేయగుట
చేసి జ్ఞాతనైన నేనీకు శేషగునయప్పశే తద్ధర్మభూతజ్ఞానతదవస్థావిశేష
రూపకర్తృత్వభోక్తృత్వాదిసమస్తవ్యాపారంబులెల్ల భవదీయంబులే
కావున శేషివైన నీవే శరీరశరీరరూపైక్యంబున నాకాత్మవై నిలిచి కృతి
ముఖంబుల నీవే నిన్ను సన్నుతించుకొనువాడవు అయినప్పుడు నీవాణి విల
శితంబు సహస్రముఖంబుల పుంఖానుపుంఖంబుగా నావిర్భవింపంగలది ।
నేనచిత్కల్పుండను ఈస్తోత్రోద్యమంబు నీదే సుమీ । పరాకుసేయక
విననవధరింపుము నాతండ్రీ సనగన్నవాడా నాకులదైవమా శే॥ (౮)

వాచామగోచరవైభవా । మీ మహిమ యంతయు దెలియుటకు
నేనెంతవాడను । ఉభయవిభూతిరక్షణదక్షుండవు నీవని ఉభయకావేరి
మధ్యవర్తికిం దెలుసును । అనన్యభోగరూపకైంకర్యపరుండవౌట
హస్తిగిరీశ్వరునకుం దెలుసును । ఫణీంద్రుడే నీవగుట బదరీనారాయణు
నకుం దెలుసును । విష్వక్సేనాంశను దయించినవాడవని వైకుంఠనాథుని
పట్టపుమహిషికిం దెలుసును । కలికలుషవిదారివి నీవని కారికుమారునకుం
దెలుసును । భవత్ప్రణీతభాష్యస్వారస్యంబు భగవంతుడగు కురంగ
పూర్ణునకుం దెలుసును । చేతనకోట్యుత్తారకంబు నీకు వాచకంబైన
చతురాక్షరియని శ్రీవత్సాంకమిశ్రులకుం దెలుసును । తావకావతార
ప్రయోజనంబు దాశరథిసూరికిం దెలుసును । హిరణ్యగర్భాదివిభూతుల
లెక్కవెట్టరు నీయాశ్రితులనుట యెంబారుకుం దెలుసును । శ్రియఃపతి
పంచాయుధంబులే నీవగుట శ్రీరంగసుధాకవీంద్రునకు దెలుసును । మీ శ్రీ
పాదతీర్థప్రభావంబు మేల్నాటివడుఘనంబికిం దెలుసును । వాదాసవ
రంబున నీవాచాచాతుర్యంబు వరదరామానుజమాసికిం దెలుసును ।
సమస్తపూర్వోత్తరాచార్యముక్తిప్రదాతవని సర్వజ్ఞభట్టరుకుం దెలు
సును । గురుపరమూర్ధాభిషిక్తుండవగుట కృష్ణపాదులకుం దెలుసును ।
సకలవేదవేదాంతహృదయవేదివని శారదకుం దెలుసును । శమితకుమత
ప్రచారుండవని శంకరాదులకుం దెలుసును । అతిశయవ్యాప్తితో మీ రధి

వసించిన దివ్యదేశంబీ శేషనగరంబని ఆచార్యవర్యులకొండటికిందెలు
సును అఖిలజనులకుందెలుసును॥ శేషనగరాధినాథా॥ (౧౦)

గురుకులాంబుధిచంద్రా । నీవుహారితసగోత్రంబునసకల కళా
పరిపూర్ణతనావిర్భవింపంజూచి వేదవేదాంతాంబుధులెల్ల మోదంబు
లంబొందియుప్పొంగె। స్మృతీతిహాసేందీవర కైరవంబులతిహాసోల్లాసభా
సమానంబులయ్యె । పురాణచకోరంబులుపోషితప్రాణంబులగుచు సవి
లాసంబులైసంచరించె । గుహదేవటంకద్రవిడాదిగురువచనసస్యంబు
లమ్లానాస్యంబులైచెలంగె । కాపిలకౌమారిలకాణాదాదిమతాంధ
కారకదంబంబవిసె । శాంకరీయపంకజంబులుసంకోచంబుజెందె ।
భాస్కరీయతస్కరప్రచారంబు దూరంబునగూఢంబయ్యె । యాదవ
ప్రకాశయజ్ఞమూర్తి హృదయచంద్రకాంత పాషాణంబులుగఱంగె ।
ఉపనిషద్యువనిషద్వైద్య రమణీ రమణవిహారణంబు విజృంభణంబు
నొందె । సంసారఘర్మసంతప్తకూరనాథకురుకాధినాథ గోవిందపాద
దాశరథి ప్రముఖముముక్షుజనవర్గంబునీకరస్పర్శంబున దాపంబులం
బాపికొనిచల్లనైయల్లసిల్లెరే।సర్వజ్ఞచూడావతంసాద్విజరాజరాజా॥ శే॥

కాంతిమతీనందనా । ఇక్ష్వాకుప్రముఖానేక రాజపరంపరకు
జన్మభూమియేకాదే । అయోధ్యానగరంబు నాడెవ్వరైననుబుణ్యక్షే
త్రంబనుచుస్మరించిరే । శ్రీరామావతారస్థలంబైన కారణంబునస్మరణ
యోగ్యంబయి ముక్తిప్రదక్షేత్రంబులలోన నగ్రగణ్యంబయ్యె । అటు
వలెనే మధురానగరంబును । యదుప్రభృతిమహారాజలోకంబునకు
జన్మభూమియేకాదే । నాడెవ్వరైన శుకవ్యాసాదిమహర్షులు పుణ్య
క్షేత్రంబనివర్ణించిరే । శ్రీకృష్ణుండవతరించిన విశేషంబునగదా
అయోధ్యా మధురాఅను ముక్తిపదంబగుచుస్మరించయోగ్యమై తద
ధిష్ఠితబృందావన నందవ్రజద్వారకాదిపుణ్యస్థలంబులతోగూడ సముగ
ణితంబయ్యె । ఆయందంబున మహాభూతనగరంబునుంబురాణప్రసిద్ధం
బైనను నెవ్వరైనగణించిరే। స్మరించిరే నీవచ్చోట నవతరించిన
పిమ్మటగాబోలు । రామకృష్ణావతారస్థలంబులకన్న బ్రహ్మవేత్తలకాద
రణీయంబయ్యె అటువలెనేయీ శేషనగరంబునీవధిష్ఠించి ప్రభావం
బుజూపుచున్నాడవుగనుక నీయవతారస్థలంబులతో సమంబగుచు ।
భూవలయంబున కెన్నికకెక్కె । ఇక దినదినప్రవర్ధమాన మహావిభ

వంబులందుచు వెలయుసుమీ॥ శేషనగరాధినాథా రామా॥ (౧౨)

యామునాచార్యకరుణైకపాత్రా। కాంచీనగరంబులో నీవు బాల్యంబునందు యాదవప్రకాశ సకాశంబున శాస్త్రాభ్యాసంబు చేయు వేళనతండు। సత్యాది శ్రుతిక పార్థకల్పనంబు జేసి శిష్యులకుఁ జెప్ప గానట్లుగాదని। సత్యాదిశబ్దంబులచేలక్షణిక వ్యావృత్తివిన్ని। అచిద్వ్యావృత్తివిన్ని చేతన వ్యావృత్తివిన్ని బోధించగా। సత్యమై చేతనాచేతన విలక్షణమైయుండును। బ్రహ్మమని దిద్దుట వినసవధరించి। మిమ్ముజూచు వాంఛ నాళవందారు కంచికరుగుదెంచి స్వర్ణకర్ణోదార దీర్ఘబాహులోచన కర్ణాద్యవయవాంచిత బగు తావకసమున్నతసుందరాకారంబుజూచి కాంచీపూర్ణునితదేకులయాళ్వారనంగటాక్షించి హర్షించి యితనినీదర్శనప్రవర్తకుంజేయుమని వరదరాజులకు బ్రపత్తి జేసెనట అదేవరగతస్వీకారరూపోపాయంబని విచారించి! నీవతనిను త్తారకునిగా విచారించి యత్పాదాంభోరుహధ్యానేత్యాద్యనుసంధానక్రమంబనవరతంబును జేయుచుతదేకప్రవణత నాచార్యాభిమానస్వరూపంబు దేయని తెలియపరచితివిగదా॥ శేషనగరాధినాథ రామానుజ॥ (౧3)

దుర్మతకదంబకాదంబినీఝంఝామారుతా। స్వాయంభువమన్వంతరంబున జంభనముచి ప్రముఖదైత్యులు చక్రాయుధుతోడ వైరంబుమనకేలనని తద్భక్తులగుచు వేద వేదోపబృంహణమార్గంబులనుసరించి అత్యంత ధర్మాచరణశీలురై। అధిక బలపరాక్రమ సంపన్నత నజేయులౌకొని దాయాదభావ ప్రియస్తులైర కారణంబున నింద్రాది బృందారకబృందంబును జయించిన వారుపరాజయంబునొంది దైత్యారికడకుంజని తమకువచ్చినపాటువిన్నవించుచు మొరయిడిన। వారుమద్భక్తులగుటచేత వారిని దానిసంహరించగూడదు। దేవవిరోధులగుట చేత సంహరించవలసె। దీనికెట్లని విచారంబుచేసి యధర్మపథప్రవర్తలగానొనరించిన సాధించవచ్చునని తదర్థంబుగా బార్వతీపతినాకర్షించి నీవు తామసమోహనార్థంబు కపిలకణాదవాచస్పతి ప్రముఖులనావేశించి। వారిచేత వేదబాహ్యమతంబులుపన్యసింపజేయుచు। నీవునువన్యసింపుమని దేవహితార్థంబుకొరకు నేనుదదర్థంబవతారంబుల నిన్ను బూజచేతు వినుమని యొడంబరచిన గానిమ్మని తదనుజ్ఞయట్ల పాశుపతశైవబౌద్ధపర్యాయాద్వైత। సాంఖ్యవైశేషిక చార్వాకాది

దుమబుతంబులం గల్పించి ప్రవతిరోంపించి గ్రమక్రమంబుగా జంభాదు లంగీకరించి భగవన్నిగ్రహపాత్రులైరి । తదనంతరంబమ్మతంబులు తత్కార్యమాత్ర పర్యవసానంబులైపోక । చిచ్చుల్లుకొన్న గతి। గతానుగతముఖప్రవృత్తంబులై లోకంబెల్ల నశింపజేయంగడంగిన గనుంగొని । అబద్ధంబులాడిదిద్దికొన్న చందంబున । పునస్తన్మత నిరసనార్థంబుగాఁ అకు సర్వేశ్వరుండు నిన్నవదరింపజేసి । నీమూలంబుగా నాత్మ సంకల్పంబు నెరవేర్చుకొనె నౌరౌర మేలుమేలు శేషనగరాధినాథా రామానుజనమోయతిరాజశేఖరా॥ ... (౧౪)

వ్యాసోల్లాససంపాదకా । వేదవ్యాసుడు వేదాంతసూత్రంబులు రచియించె । అంజలియర్థంబుశరవైరి ద్రావిడ వాగ్వృత్తిని విదితంబు జేసె । తత్సూత్రంబులె కొందఱన్యథాజ్ఞానప్రచురులైనకుదృష్టులు గీర్వాణవాణివ్యాఖ్యానమిషంబున దదభిప్రాయం బెఱుంగక । చీకాకు పఱచిన మర్కటహస్తమాల్యప్రాయంబయ్యె । నీవది గనుంగొని యయ్యోయని విచారమునొంది తథాభూతసూత్ర పరిపాలనైక ప్రయోజనార్థంబుగా నావిర్భవించినవాడవిదితథ్యంబు యెట్లన్న నది కార్యానుమేయంబే కాదే । సదేక వేద్యప్రభావ । శేషనగరాధి రామాను॥ ... ... ... (౧౫)

మాయాదర్శనతూలానలా । టంకద్రవిడగుహదేవాద్యనవీన మహాపురుషప్రణీతానేక వేదభాష్యంబులువికల్పాటోపంబున శంకించి శంకరుండుసంకరాపార్థసంకుల యుక్తికల్పితంబులగు భాష్యంబున నసురప్రకృతులగు తత్కాలవిద్యమానతామసజనులగొందఱిని మోహింపజేసె । అదితామసమోహనార్థప్రణీత ప్రచ్ఛన్నబౌద్ధశాస్త్రం బగుటపద్మపురాణోత్తరఖండంబునందుబ్రసిద్ధంబు । అది యంతటనె శమించక పాముకాటుచందంబై విషంబెక్కి వచ్చినట్లు దినదినం బున గ్రంథపరంపరాన్యాయంబున అపరమార్థ పరమార్థవిభాగజ్ఞాన శూన్యంబగులోకంబునవిస్తరించిరాజూచి గ్రక్కున నీవుసేకరించుకొని భగవద్బోధాయనవృత్తిననుగుణించి పరాంకుశసూక్తిభావానుసారిగా బ్రహ్మసూత్రంబులకు భాష్యంబుసేయగాజూమీ । టంకాదులు నిరాటంకులైరి । ప్రపంచమిథ్యాత్మవాదంబులడంగె వేదవేదాంతాది శాస్త్రంబులును మిథ్యలైపోక సత్యంబులై తత్పథంబులు నిష్కంట

కంబులయ్యె । వేదవేద్యంబగుపరబ్రహ్మంబుకల్యాణగుణాత్మకంబయ్యె ముక్తులుంగలరని కనుపించె । ఇవిమొదలైనవిభవంబులు నీవలననే కలిగెగనుక లోకరక్షకుండవైతివి । లోకనాథరక్షకుండవునివున్ననాత ప్పేమి యనవచ్చునే । శేషనగరాధినాథ॥ (౧౬

అఖిలవేదవేదాంతార్థనిర్ణాయకా । ముముక్షూపాస్య కారణవస్తుప్రతిపాదకత్వంబుననుత్తరోత్తర విశేషవాచకంబులగు సద్బ్రహ్మాది సాధారణశబ్దంబుల సాధారణ నారాయణశబ్దవాచ్య పర్యవస్థితంబులైన కారణంబున దత్పదార్థానురోధంబు భేదాభేద ఘటకశ్రుతిజాతంబున కన్యోన్యవిరోధంబు లేకయుండు ముఖ్యార్థపరిత్యాగంబునుంచేయక । నైకకంఠ్యంబు సంపాదించి । కేవలద్వైతాద్వైతవ్యావృత్త విశిష్టాద్వైతంబు రాద్ధాంతంబుచేసి స్థాపించి సర్వశరీరత్వంబున బరబ్రహ్మమేసర్వప్రకారంబుల నున్నదని యభేదంబును సమర్థించి తనయొక్క పరబ్రహ్మమేనానాభూతచిదచిత్ప్రకారుతయా నానాభావంబుల నున్నదని । భేదాభేదంబులును సమర్థించితివి కార్యకారణత్వావస్థలందు జిదచిదీశ్వరులకు స్వరూపస్వభావసాంకర్యంబు లేమిగాని భేదంబును సమర్థించగా । స్వరూపపరిణామపరిహారంబున నవికారశ్రుతులు ముఖ్యార్థంబులై నిలిచె । నిర్గుణవాదశ్రుతులు ప్రాకృతహేయగుణనిషేధ విషయంబులై వ్యవస్థితంబులయ్యె । ప్రకారినానాత్వానంగీకారంబును॥నానాత్వనిషేధవాదశ్రుతులు రక్షితంబులయ్యె । సర్వవిలక్షణలక్ష్మీపతిత్వేశ్వరత్వ కల్యాణగుణాకరత్వాది ప్రతిపాదితవాక్యనికరంబులు త్వదంగీకారంబుననే సురక్షితంబయ్యె । నకలేతరవిలక్షణ బ్రహ్మస్వరూపనిరూపకధర్మంబఖిలహేయప్రత్యనీకానందరూపజ్ఞానంబేకావున । నపృథక్సిద్ధధర్మివాచిశబ్దంబులుధర్మి పర్యంతముగుటబట్టుండీ స్వప్రకాశత్వంబున ధర్మ స్వరూపంబును । తాదృశంబని ప్రతిపాదించుటవలన జ్ఞానానందమాత్రవాదివాక్యంబునుబాలితంబయ్యె । ఐక్యవాదశ్రుతులు శరీరాత్మభావప్రాప్త సామానాధికరణ్యంబున ముఖ్యార్థోపపాదనంబే చేయగా సుప్రతిష్ఠితంబులయ్యె । ఈసరసమార్గంబు నీసిద్ధాంతంబుననే కాని యితరమతంబుల యందు గానంబడదు కావున । నీసిద్ధాంతంబుముందర నన్యమతస్థుల వాదంబులు తూలాయమానంబులై మెగసెదిగంతవిశ్రాంతంబయ్యె నీవిజయంబు॥ శేషనగ॥ (౧౭)

జయవేదవేదాంతప్రతిష్ఠాపకా । మాయావాదిదైత్యమండలిపుం
డరీకాక్షా । పాశుపతశైవభేదపారావారపరంపర కుంభసంభవా ।
బౌద్ధరాద్ధాంతక్షత్రకుల పరశురామా । చార్వాకసమూహభీకరవిభాకరా
జైనమార్గసారణ్యదావపావక । కాపిలవ్యాళవితానవైనతేయా । కా
ణాదాచలకదంబశంబా । కాపాలికానేక పానీకకంఠీరవా । సకల
స్మృతితూలజాల ఝంఝానిలా । బాదరాయణపరాంకుశపక్షరక్షా
దక్షా । పరాశరబోధాయనాదిభాష్యప్రకాశకా । నాథయామున
నిర్ణీతపదానురోధబోధ॥ శేషనగ॥ (౧౮)

ఉభయవేదాంతనిధానభూతా । నీవు శ్రీభాష్యంబు జేయు వేళ
సాక్షాద్భగనేయుడైన దాశరథుండు సముక్షంబుననుండియున్న
తనచేత వ్రాయించక కూరేశమిశ్రులను గొని లిఖింపించుటకు గా
రణంబేమి । నీవు రామైకప్రవణలక్షణుండవు । అది రామశబ్దాభిధేయ
పరబ్రహ్మస్వరూప గుణవిభూతివేదకంబుగనుక రామాత్మకుండైన
వేద్యవేత్త యతండు తత్సమ్మతంబుగా జేయదలంచి కాబోలు అట్లుగా
జేసి యతడు వ్రాయక యూరకున్న యుపదేశంబులవల్ల పూర్వయోజనల
వల్లనిడని యోజనాంతర రచనలు గతువే । యిట్లైతేంగున వేద్యుడే
వక్తి లేఖకుండై పలిచెగనుక । యిది వేదాంతవేద్యసమ్మత భాష్యం
బని వ్యక్తంబయ్యె । తల్లిఖిత భాష్యంబును దన్ముఖంబుననే ప్రవచనం
బు చేయించక కురుకేశమిశ్రముఖంబున జేయించుట యేమి । వేద్యుం
డే వేత్తయగునేయని । వేద్యవేత్తలకు భేద్యంబు చూపుచందంబున ।
వేత్తాగ్రేసరుండై శఠారి యేయితండని కాబోలు । కాక యున్న
నతనిచేత నేద్రవిడోపనిషద్భాష్యంబు చేయింతువే శ్రీభాష్యంబు చేసిన
నీవే చేయరాదే । యింతమాత్రమె కాక మొదలనె యతని శారీర్యంబు
కురుకేశనామంబిది నీవే ప్రకటంబు చేసినావు । యిన్విధంబున నేత్రా
గ్రేసరసమ్మతంబున్న య్యెగనుక । భవత్ప్రణీతభాష్యసన్నిధిని వేద్య
వేత్రుభావరుద్ధావ్యాకృతభాష్యంబులెల్ల విగళితంబులై నిరాకరింపం
బడె । కురుకాధినాథవిరచితద్రావిడవేదభాష్యంబును । తన్ముఖంబు
ననే ప్రవచనంబు చేయించక । శ్రీవత్సచిహ్నముఖంబున జేయించుట
అది వేద్యహృదయప్రియతమంబేయని తెలుపవలసి కాబోలు । యిట్టు
వలె మీదివ్యచేష్టితంబులన్నియు గారణగర్భంబులై గనుక తత్త్

తాత్పర్య పరామర్శవిమర్శకాస్తిక్యాగ్రేసరంబు లితరులకమేయంబులు
గదా శేషసగరాధినాథ రామానుజ! ... ... (౧౯)

భగవదేక వేద్యస్వరూపా! తొల్లినీవు లక్ష్మణస్వరూపంబుతో
రామునియందు సర్వదేశసర్వకాల సర్వావస్థోచిత సర్వప్రకార శేష
వృత్తుల నెల్లఁ బాయక చేసి మెప్పించితివి! అవనీకుసహజవిద్యరాముడు
కృతప్రతికృతప్రక్రియ నపేక్షించి తానునీయందట్లఁ జేసి నిన్నుమెప్పిం
తునని పడసకొంకు వేల యేండ్లుజూచి చేయలేక యనుజభావంబున నే
కానియగ్రజత్వంబున నెట్లు జేయంగూడునని యాయవతారంబున
జేయునివాఁడై! అవతారాంతరంబున నైన జేయక విడువనని వసు
దేవకులంబునందు దేవకీగర్భంబున నవతరించు సమయంబున! రామ
నామంబుతో నిన్నగ్రజుంగమ నిగర్భసంకర్షణ వ్యాజంబున భిన్నోద
రత్వముంగలుగునట్లు తాననుజుఁడై జయించుక మునుపురి! ద్వాపర
యుగాంత పర్యంతముంజూచియుం జేయలేక! ఈశేషత్వనిష్టమంత్ర
రాజాష్టాక్షర ప్రకృతిభూతప్రణవార్థరహస్యమర్మంబైన యప్పుడు ఉప
దేశముఖంబున లభించక! స్వాతిసర్వజ్ఞత్వంబుల స్వతంత్రుండై
చేయఁగూడునే యని తెలిసి! బదరీయందు మున్ను శిష్యన్పత్తిజూపు
టకై తానే తనకు శిష్యుడై కొఱతదీర! ఈయుగంబున శ్రీవత్సాంక
మిశ్రుండై శిష్యభావమందినపుడు నీవుమనోపవాస నియమనాదిసిద్ధు
లంబరీక్షించి! ఉపదేశించఁగాదెలిసి! నీవు త్రేతాయుగంబున తన
యందు శేషవృత్తులుజేసి మెప్పించినభంగినే! తానునీయందు విష
యాంతరంబుల నెఱుంగక! సర్వప్రకార కైంకర్యంబులుంజేసి మెప్పించె
ఈ శ్రీవత్సాంకమిశ్రుల రామత్వంబు సత్సంప్రదాయజ్ఞ సర్వపూర్వ
గుర్వాభిప్రాయనిశ్చితంబని శరంపరాశ్రుతమాటచేత! నైతిహ్యసిద్ధంబు
కులదైవతంబగు రంగనాథుని చిరవిరచిత పరిచర్యల పరితోషింప
జేసిన విశేషంబున నాఁడు యమళపుత్రులంబడసిన విశిష్టంబున నేను
తత్ప్రసాదంబున నే యమళపుత్రులం బడయుటచేత ప్రత్యక్షసిద్ధంబు
తద్వంశ్యులెల్ల రాజలక్షణాలక్షితలయి వర్తించుటచేత ననుమాన సిద్ధ
ముగదా శేషసగరాధి! ... ... (౨౦)

అఖిలలోకైకపూజ్యా! అగస్త్యాశ్రమంబగు తిరుక్కురుంగుడి
యందుపూర్ణాభిధానుండైన హరి తానెన్న యవతారంబులెత్తియు

చేతనుడు సభిముఖుండుగాడు । నీకీలోకం బెల్ల నభిముఖం బైన కారణం
బేమి తెలుపవేయని మిమ్ము సింహాసనాసీనుంగావించి । తాదిగువనుండి
మీరుపదేశించగాద్వయం బధికరించి మీ పేరుధరించెనట । మంత్ర
రత్నంబధికరించు మర్యాదయును । తదనంతరంబు తదధికారి కర్తవ్య
కృతజ్ఞతాపూర్వకథాప్వానువర్తనంబునుం దానే ఆచరించిచూపి ।
భవత్ప్రణీతభాష్యంబు తనకు సత్యంతస్పృహణీయంబై యున్నదని ।
తద్గ్రంథగురుత్వసత్యత్వసరసత్వంబులునుం బ్రకాశింపజేయ తలంపున
మీరుపన్యసింపగా । శ్రీభాష్యశ్రవణమొనర్చెసె గావున మీమహిమా
తిశయంబు దెలియ సర్వేశ్వరుండే నేర్పుగాని యితరులు నేర్తురటే ।
శేషనగరాధినాథ రామానుజ॥ ... ... ౨౧)

విజయశీలా । మీరుదిగ్విజయంబు సేయుటకొఱకు భూప్రదక్షి
ణం బాచరించుచు । శారదాపీఠంబునకు విజయంబుచేసి । తత్రత్య
రాజసభయందు వేదార్థసంగ్రహం బుపన్యాసంబుచేయగా నచట
మహాతార్కికులైన మిశ్రులందఱును మీతో వాదించలేక పరాజ
యంబునొందియు। శారదా సన్నిధానంబున మీకృతినిలిపి యంగీక
రింపజేసినప్పుడుగదా । మీరుజయించుటకు గురుతనిపదావదులై
కలిసిన మంచిదేయని మీరును నటువలెనే చేసినప్పుడు మీకృతిశార
దసిరసావహించెనట । తత్కృత్యంబందఱుంగని ఆశ్చర్యంబు జెంది
రట । అదిఆశ్చర్యమా । బ్రహ్మపత్నియగు శారదజగజ్జనకుండయిన
కమలనాభునకు బెద్దకోడలు తనకత్తను మామగనుక తత్సారప్రతి
పాదకగ్రంథంబు నిరసావహించుటయును । తద్వక్తయగు మిమ్ము
సత్కరించుటయు నత్యంతోచితమేకదా॥ శేషనగరాధినాథ॥ (౨౨)

జీవేశ్వరభేదసమర్థకా । యజ్ఞమూర్తినామంబుగల ఆంధ్రదేశీ
యుండైన యేకదండి । అద్వైతసమర్థంబు చేయుచున్నా నాభూము
లుందిరిగితిరిగి । బహుశిష్యసంఘంబుతో శ్రీరంగమునకువచ్చి।మీతో
వాదంబపేక్షించిన । అష్టాదశవాసరావధిపరిక్షిప్తనాదంబున ।।జయా
పజయంబులుసాక్షైకసంవేద్యములేయని నిశ్చయించికొని వాదించు
చోట పదునాఱుదినంబులు ప్రత్యహంబును జయాపజయంబులు కను
పించక । సప్తదశవారంబున బ్రహ్మవేత్త బ్రహ్మమేయగానన్ని శ్రుతి
నుడివి । అద్వైతంబై సమర్థించగా నాడు వార్తాపట్టంబున భేదమే

సిద్ధాంతంబని యానతిచ్చిన పేరరుళాళరుకు విన్నపంబు జేసిన నద్దే
వుండు । స్వప్నసాక్షాత్కారుండై నీకుదొడ్డశిష్యుని గలుగజేయు
దలంచి । యిటువలె చేసితినిక । ప్రణతప్రాసనుశింపకు శ్రుతి ఉపన్య
సించి గెలువుమనిన । మేల్కని కూరనాథ ప్రముఖులకానతిచ్చి ప్రసన్న
మానసంబున యథాపూర్వకంబుగా సభామండపంబున వసియించి
సర్వోపాధివినిర్ముక్తసాయుజ్యరూప సర్వోత్తర ముక్తిదర్శక భేదక సమ
ర్థకశ్రుతుల కవిరోధంబుగా । పూర్వదవసోపన్యస్తాద్వైతద్యోతక
శ్రుతులకన్నిటికి నైకకంఠ్యంబు చేసి । భేదంబెయుపపాదించిన జూచి
నిరుత్తరుండైన సమ్మోదించిహర్షించి శిష్యభావంబపేక్షించిన పునరు
పనయనపూర్వకంబుగా నతని పంచసంస్కార సంపన్నునింజేసి ।
దయాపాల రామానుజనామంబున త్రిదండినింజేసిన । నతండుజ్ఞాన
సారప్రమేయంబులను రెండుప్రబంధంబులొనర్చి । సన్నిధినుంచి
అత్యంత పారతంత్ర్యంబునొంది సర్వపూజ్యుండయ్యెనట । యెందు
జూచినను నిన్నుమించ తత్వదర్శిగలుగునా శేషనగరాధి ౨౩)

కాంచీపూర్ణనిరతా। మీరడిగినతత్వదర్శనమోక్షతదుపాయ
గురువరణార్తిమస్మరణనిమిత్తంబులైన అర్థంబులు వరదుడానతిచ్చిన
క్రమంబున । తిరుకచ్చినంబి దెలుపగామీరుదెలిసితిరట । యింక
చేతయీవార్తాషట్కంబును భగవన్ముఖనిశ్చితంబయ్యెగనుక । సత్యం
బనుటయును । అర్చారూపంబునందు భగవచ్చైతన్యంబింత పరిపూర్ణం
బనుటయు తాదృశజ్ఞానామగుణవ్యవసాయప్రేమవంతులకే అదిప్రత్య
క్షంబనుటయును । ప్రత్యక్షీతాత్మనాథుండీ తిరుకచ్చినంబియనుట
యును అతండవసరతంబువరదునితో నేకాంత సమయ సంభాషణం
బులు జేయుననుటయును । వారిరువురికిని మీరాప్తతములనుట
యనగా నివియొక ఆఅర్థంబులు నీవలననే బయలయ్యె । యీహాత్తు
ర్యంచాహ్యల కాశ్చర్యసంపాదకంబయ్యెగదా॥ శేషనగ॥ (౨౪)

వరదప్రియతమా । యాదవప్రకాశునిమాత తనకు స్వప్నం
బైనకరణిని పుత్రునకు త్రిదండసన్న్యాసంబు చేయుమని విధించి
నతండు । శిఖాయజ్ఞోపవీత పరిత్యాగ ప్రాయశ్చిత్తంబుగా భూప్రద
క్షిణంబాచరించవలెనింత ఆయాసంబునకోసను । వరదరాజస్వామిని
యాచించినట్లు చేసెదననిన । నద్దేవుండు పేరరుళాళరను పేరు సార్థకం

బు చేసుకొనుటకిదియె సమయంబనియెడు వానివలె । మా రామాను
జులకొకమాఱు ప్రదక్షిణంబు చేసి నమస్కరించినం జాలు । నీకుఁ భూ
ప్రదక్షిణము చేసిన ఫలంబు సమకూరునని యానతిచ్చి । ఈ మహిమ
విదితంబు చేసెనట । నీవు భూమిదలకెత్తుకొన్న శేషుడవే గనుక త్వత్ప్ర
దక్షిణఫలము నొసంగగల విదియాశ్చర్యమా ॥ శేషనగరాధినాథ ।

విశిష్టాద్వైతనిర్వాహకా । నాథయాముననిర్ణీతసిద్ధాన్తానుసారి
గా మీరు వేదాన్తంబుపన్యాసంబు చేసి తనపక్షంబు పూర్వపక్షంబు
చేసికొంగని యాదవప్రకాశ యతివరద రాజనియమనము పైకొని
అంతేవాని భావంబునొందినపునరుపనయనపూర్వకంబుగా । తాపాది
సంస్కారసంస్కృతుంజేసి గోవిందజియ్యరను దాస్యనామంబున
త్రిదండ సన్న్యాసంబస్వీకరింపించి । అతనిచేతనే యతిధర్మసముచ్చ
యంబను గ్రంథంబు జేయించితిరట । మీ వేదాన్తవేదిత్వంబును వేద
మార్గప్రతిష్ఠాపకత్వంబును । ధరాతలంబున బ్రఖ్యాతములయ్యెనహో ॥ శే॥

వకుళాభరణ ప్రకటీకృతప్రభావా । యోగిజనాగ్రగణ్యుండైన
శ్రీమన్నాథమునివర్యుండు మధురకవిప్రణీత శఠారివిషయప్రబంధం
బు పండ్రెండు వేలమాఱులు జపంబు జేసినకురుకానగరాధిదేవతయగు
నాళ్వారు సాక్షాత్కరించి । తదభిమతంబు దెలిపి ద్రవిడాగమజాతంబ
ధర్మపూర్వకంబుగా నుపదేశించుచు । తత్కాలంబునకు భావియగు
భవదీయావతారంబు ప్రశంసించి త్రిదండకాషోపవీతధారణాంజలి ము
ద్రాద్యుపశోభితంబగు విగ్రహంబునను గహించి యీ మహాత్ముడు
సుమీ మన కందఱకిని ముక్తిమూలంబని యానతిచ్చె । అన్నను నీగు
రుత్వంబియత్తావచ్ఛిన్నంబున నెవరికి వశమే ॥ శేషనగరాధినాథ॥

కమలాకాంతమనోరథానురోధా । కారపందనచరణ కాంచి
పూర్ణప్రవణా । యామునాచార్యకరుణాకటాక్ష పరిపూర్ణ పూర్ణాచార్య
చరణసమాశ్రయా । గోష్ఠీపూర్ణవశంవద కూరేశప్రియ । కురుకాధ
నాథ । చంద్రసాగరపాదచ్ఛాయాభూత గోవిందవంద్య పాద్రుభూత
దాశరథిసంసేవ్య ఆంధ్రపూర్ణ పరబ్రహ్మ అనిరుద్ధన్వివాసద్వైత రంగా
మృత విస్తుతి రమ్యజామాతృమానిమానసనిలాస శేషనగరాధినాథ
రామానుజనమోయతిరాజ॥ ... ... (౨౯)

శఠకోపచరణరూపా చతుర్విధయుగవర్ణంబులందు క్రమంబున స్వతంత్రుండైన భగవంతుండు కర్మవశ్యనిరంకుశ నిజేచ్ఛనవంతరిచుచు తురీయుంబైన యీ యుగంబునందునట్లయవతరించి ద్రావిడబ్రహ్మసంహితాప్రవర్తకుండైన తత్ప్రవచనంబుతదర్థపూర్వకంబుగా బహుముఖంబులనీ వేయొనరింపంజూచి తత్వజ్ఞులెల్ల భగవదభిప్రాయాను గుణకార్యనిర్వాహణస్వభావుండగు విష్వక్సేనుడేయితండని నిశ్చయించిరి ఇందుకు సందేహంబేమియున్నది నీవు విష్వక్సేనావతారంబని పద్మప్రతిపాదితంబగుట వృద్ధపాద్మంబున విదితమాకదా ॥ శే॥

ఆద్య దేశకచ్ఛందానువర్తి నమాళ్వారుతమచరమ ప్రబంధంబులోద్రమోవింశద్ధశకమునం దాద్యగాథయం దసవరతకైంకర్యంబు జేయనలయు తాముతిరువేంగడముడయానుగనదలంచి వెళ్ళనాడిన వచనంబనుష్టానపర్యవసాయంబు జేయుటకు మీరుతిరుమలమీది కనంతాళ్వారును నపించిన నతండచట పద్మాకనిర్మాణంబుచేసితజ్జలసేకవర్ధితంబుగా నొకతిరునందవనంబును గల్పించి తత్ప్రసూనీత తులసీపుష్పసంచయంబుచేత్రదికాలంబులనుండి తిరుమాలెలుగట్టించి బాతించెనట యీచర్యవిచారించిన మీరాళ్వారునకు గారణభూతులయిన కరణి ననంతాళ్వారు మీకుగారణవత్పరతంత్రుడగుట తేటపసినట్లుండే

విచిత్రచరిత్రా। చిత్రకూటనివాసియైన గోవిందరాజు చోళోపద్రవవ్యాజంబునస్థలంబువిడిచివచ్చిన ॥ అతని తిరుపతిలో ప్రతిష్ఠజేయుట కక్కడి వైఖానస పాంచరాత్రులతో మైత్రిచేసి సమర్ధించితివట । అతనికిచోళకృతోపద్రవంబు నివారించుకొనుసూత్రంబు శక్తి లేకయుండెనే । అందుకేమి అభావంబు నేనెఱుంగుదు । తానుగులశేఖర సూరికిబరవశుండను । తదనుసంధానానుగుణ్ణంబుగా। రామస్వరూపంబగుటయును నీవులక్ష్మణావతారంబగుటయును । ఈరెండునున్న ప్రకటంబుచేయదలచి వచ్చెగాబోలు యిదితత్వంబేకాకయుండిన దశరథకులంబుననవతరించిననాడు వనవాసమయంబున స్వయంతు రుచిరే దేశేక్రియతామితి మాంసదా అనినీవు ప్రార్థించగా అటునలె నేనియమించిపర్ణశాలాది నిర్మాణరూపకైంకర్యంబుగైకొనిన యలవాటుచేత దానేవచ్చి నీచేతనవెల కట్టించుకొని నిలిచి సుఖించు కారణంబేమి యానతీయవే ॥ శే॥ ... (౩౧)

మంత్రరత్నవివరణవిచారచతురా । తొల్లిపితామహానుజ్ఞను తత్పుత్రిసంకాశంబున సంక్షేపంబుగా శ్రీరామాయణమూలంబువిని దైవచోదితవచనంబులదానది విస్తారంబుచేసి దీనియర్థంబుపితామహునకుండెలియదు ప్రపితామహునకుండెలియదు పితామహి పితామహునకేగాని అతనివలెనీవాక్యంబులకిరువది నాలుగేసి యర్థంబులు ప్రతిపాదింపనెవ్వఁడోపు తత్సన్నిధినధికరించి దీనియర్థంబును భూమండలంబున విస్తరింపజేతునని మెడి తలంపున బ్రాచేతనుండీ రూపంబునవచ్చెగాబోలు కాకయున్న నితనికి రామావతారప్రసిద్ధినొందిన శ్రీవత్సాంకమిశ్రులయంశపుత్రులందాను నామకరణాది సంస్కృతులుంగాజేసి పోషించుమరులేలవచ్చు తద్వాసన జన్మాంతరంబుననైన విసువశక్యముగానిదేకదా యని నాచూపున మీచర్యపర్యాలోచనజేసి మిమ్ము శ్రీవాల్మీకిభగవానునిగా నూహించినాఁడ యిదియపరాధంబుగా గణింపకుమీ॥ శ్లో॥ ... ... ... (32)

శ్రీశైలపూర్ణప్రియా తిరుమలనంబిగారు మీకు శ్రీరామాయణార్థంబుప్రసాదించి స్వశిష్యులైన యెంబారును దారవ్రాసియివ్వగా బరిగ్రహించి మగుడి కోవెలకు విజయంబుచేయువేళ మార్గమందు నెంచారుకాచార్య విశేషంబునచరణ ముఖంబులు శోభించినంజూచి మీరాచార్య సన్నిధికేపోమ్మనినియోగించిన ఆటువలెనేవచ్చిన యెంబారునంబిగారు విననవధరించి సమస్తమునకు రానీయక అమ్మడు బోయినపసరమునకు గసవువేయునారుంగలరేయని అశనమునిడక తమమీదియాశవిడిపించుదలంపున దలవాకిటనుండగనేపొమ్మనిపించిన పిమ్మట మిమ్మేచేరి అన్యశేషవిముఖులై మీకు చరణచ్ఛాయయగుచు వసించెనట యిటువలె పశుదృష్టాంతంబున నిరూపించుటచేత శిష్యవస్తువుతనస్వామితలంచినట్టునడిచి తాద్రుశస్వప్రవృత్తినివెంట నీమరచి తనధీనజీవనతను దానవిక్రయాదియోగ్యమైయుండవలెనని చూపినచందమైయుండెఁ॥ శ్లో॥ ... ... (33)

ముముక్షుజనలోకలోకబాంధవా కాలజ్ఞమహర్షివచోఘోషసూచింతబగు నీయచలాభ్యుదయంబునకు బూర్వాంబైనపరాంకుశారుణోదయంబుగని మేల్కని మధురకవినాథ యామునాదిసత్కర్మనుష్ఠాతలు శుచిర్భావంబునొంది నీమూర్తి సందర్శనంబునకు ముందు

వెనుకగా నర్ఘ్యప్రదానంబులాచరించిరి । నీవునుదయించిన మాత్ర
మున గలికలుషాంధకారం బెచటికో తొలంగె నమస్తదివ్య దేశదా
పటంబులుం దెరచి । ఆరాధనంబులుం జేయదొడంగిరి భటనా
రకాల ముఖముఖాంబుజంబులు వికసించె నీవుదిష్ణుపదం బాశ్రయించి
ప్రకాశించుకొలందినీకు పిఘ్ఘ్యాకంబులాకలాంతరంగంబుల చీకాకు
పడి తలలు చూపవెరచె । దకపర్దిమతాదికర్దమపల్వలంబులెల్ల శో
చెనీవు ప్రపన్నగాయత్రి జపంబాచరించువారికి గర్మసాక్షివి। త్రయీ
మూర్తివి । నిన్నుపాసన చేయువారికి భవరోగంబులంటవు సుమీ
మునిచక్రమిత్రగురుకుల హంస ॥ శేష॥ ... (38

భవరోగవైద్యా ప్రకృతియనియెడిరోగంబునన్నాడినుండియు
దానిగుణంబులు ప్రతిసమయంబులందునువిషమించిబహు వికారంబులు
బొడమించగా బలసి యనవరతతాపంబులం జూపుచు నేటికివిడదు
దీనిచే బహుక్లేశంబు లనుభవింపుచున్నవాడను । దీనిమానుప నీవు
కాని యీలోకములో వైద్యులెవ్వరునోపరు । నేనైతే అగతికుండట్టి
అకించనుండను నీకేమియొసంగగలను । నీయాధర్మంబు నీపదపన
పూర్ణచంద్రోదయంబుతో కారుణ్యగుణంబను పానంబుగా బెట్టి
శ్రీపాదతీర్థామృతసిద్ధ రసౌషధం బొసంగి తళియప్రసాదస్వీకారరూపం
పథ్యక్రమంబుననిల్పి।విరజోదకంబుననారోగ్యస్నానంబుజేయించుమీ

రంగేశదత్తైశ్వర్యాభిరామా । యామునాచార్యనియోగకా
రణంబున భోగమండపంబు చొరనొల్లనినీయలుకదీర్చిరప్పించు
కొనుటకు । రంగనాయకులు తనవదిగాయకుల నంపించి వేగవతీ
నివాసియైన త్యాగమణ్ణపీశ్వరుండగు దేవరాజును గానవిద్యాముఖం
బున మెప్పించి నిన్నతనిచేత త్యాగరూపంబుగా నందుకొని తెచ్చు.
తంత్రంబుచేసి అటువలెనరుగుదెంచిన నిన్నుదుర్కొని । అపారదయం
గని సకలసన్మానంబులు చేసి । తానును నీవశమైతినని తనయుభ
యవిభూతులు నీచేతికినిచ్చి । నిర్భరుండై వర్తించెనట । ఇటువంటి
విశ్వాధిరాజ్యంబుగలవాడవునీవు । నీమంత్రులు నీయంతరంగులు
వారు నన్నభిమానించిరి నేను వారివాడనై తినికనాకెదురెవ్వరే॥ శే॥

గోష్ఠీపూర్ణవశంవదా । మీరుచరమశ్లోకారంబధికరించుటకు
గోవెలనుండి పంచయోజన ప్రమాణదూరంబగు గోష్ఠీపురంబునకుం

జని । నంబిగారి సన్నిధిని స్వాభిప్రాయంబు విన్నపంబుచేసిన నర్థగా
రవమున్నధికారిదౌరభ్యముం గనుపింపజేయవలసి యిప్పుడుగూడ
మగుడిరమ్మనుచు నిర్విధంబున బదునెనిమిదిమాఱులు నడువజే
అరుదుపరిచి బహువిధంబుల పరీక్షించి । ఆమీఁదనానతీయగా నధికరిం
చితిరటఇంచుకమించు లేక పదునెనిమిదిమాఱు నడవజేయు
పంచమవేదంబగు భారతం బష్టాదశపర్వాత్మకంబు । తత్సారభూ
గీతోపనిషచ్ఛాస్త్రంబున ష్టాదశాధ్యాయాత్మకంబు । తదుపరి పరి
రహస్యంబుఁగావున । పద్యాధ్యాయసంఖ్యను నడిపించి । అంతటను
ద్దేశించవలెనను తలంపుననో యేమి తెలుపవే ॥ శేష॥ (3౭

బద్ధాత్మరక్షణబద్ధకంకణా । నీవునకలవేదవేదాంతాదిశాస్త్ర
వేత్తవగుచు । ప్రమాణపరతంత్రుండవయ్యును బుద్ధిపూర్వకంబుగా
గురువచనంబతిక్రమించి తత్ఫలంబుగ దుర్గతివచ్చిననైన రానిమ్మని
సమ్మతించి సంసారావ గవ్వంబునం జిక్కుకొన్న పునఃపున
జన్మమరణనిరయ పతనరూప పరిభ్రమణంబులం గ్లేశింపుచున్న చేత
నులంగటాక్షించి । అగ్గలంబుగా పెకలివచ్చుదయ నాచలేక ఆశ్రిత
నజాలుగాని అధికారపూర్తి లేకయున్న నుండనిమ్మని అందఱకిమ్మం
త్రముపదేశించి ముక్తియొసంగితివి । అధికారుల కుపదేశించిన తమ
కెక్కడ హానివచ్చునో యనివెఱిచి స్వోజ్జీవననిమిత్తలోభంబున దయ
నించక । పూర్వులెవ్వరు నీవలె నుపదేశించలేకపోయిరి । తాదృ శ
శదయాగుణంబసాధారంబుగా నీయందే కనుపించెగావున । నీవుసర్వో
త్తారకుండవైతివే । శేషనగరాధినాథ ॥ రామానుజ॥ (3౮

సర్వోత్తారకా । సంసారచేతనోజ్జీవన కాముకుండగు సర్వేశ్వ
రుండు । రామకృష్ణాదిరూపంబులనావిర్భవించిపరత్వప్రయుదుద్వేశ్వ
మానుషదివ్యచేష్టితంబులం గనుపింపజేయుచున్న విభీషణధనంజయా
వ్యాజంబున ప్రపత్త్యుపదేశముంజేసి । ప్రపన్నరక్షణంబు తనవ్రతచి
మని పరీక్షించి । శరణవరసమర్థులరాక నిరీక్షించునప్పు డెవ్వరవత
పరించు వారులేకపోవుటచేత । చేతన సంరక్షణంబుగా నేరకవ్యా
ల్యస్వామిత్వసౌశీల్య సౌలభ్యాదిగుణంబులు నసత్కల్పంబులయె
నీవావిర్భవించిచేతనుల దుఃఖిత్వాజ్ఞత్వకుటిలత్వాదులగన్నవాడ
వారయ్యువచ్చి పరించవలెనని యెదురుచూడక కై । వారలనచే
యత్నేనపరించిన పరమదయాళుండ వైన చతురుండవ్వగను కి ।

జాతంబునకు మోక్షమున్ ఘటించె పూర్వోక్తగుణంబులకు నంత యం గనుపించె। అనిరతసాధారణోపాయాత్మకాచార్యత్వము నీయం దేనియుతమయ్యె । ఈ పరగతవరణంబు స్వగతవరణంబువలెగాక ప్రబలమై అమోఘంబగు నీవు రామానుజుండవై యున్నకాలంబున । వైద్యుడైన మీయన్నవలననే శ్రీగుహాది వృత్తాంతంబుల యందు గన్నావు । నాయమాత్మేత్యాది ఘణితిచేతవర్ణించి । ఆశించినవేద పురుషునియందు విన్నావు । పితామహునివలన పరమాచార్యులు లభించిన చందంబున । పరమాచార్యప్రథమాచార్యులవలన నీవు లభించినున్నావు । కావున వేదవేత్తలకీ పరగతస్వీకారమందే తాత్ప ర్యమని తెలిసెనారార ॥శేషనగ॥ ... (౩౯)

లక్ష్మణాఖ్యశేశిశశిఖామణీ నీవు ద్వితీయవర్ణమందు దశరథ కులంబున రామానుజుండవై యుండునపుడు ధనుర్వేదాధ్యయనంబు చేసి అరురుకుదశను చాక్షుషలక్ష్యంబులంటనేసితివి । నేడగ్రవర్ణోత్ప న్నుండవయ్యును తజ్జన్మాన్తరసంస్కారవిశేషవశంబున తత్పర్యాయ విద్యయందన్వయించి । అరూఢంశనొంది ప్రణవకోదండంబు ప్రపత్తి గుణసమేతంబుచేసి అందు భరతఖండాక్షయతూణీస్థబద్ధాత్మశరీరకిబు లందివిచితివిచితొడిగి ప్రతివేళలందును సప్తలోక బ్రహ్మాండకటాహ సప్తావరణంబులుం గాడిపారి తట్టునసూటిదప్పక । నచాక్షుష పరమా కాశభాసమాన పరబ్రహ్మలక్ష్యంబున నాటుకొననేయ బట్టితివి । ఈ చాతుర్యంబెన్నడు గన్నది విన్నదియుంగాదు । వారివార బ్రహ్మాదులకు నవాఙ్మానసగోచరమహో ॥శేషనగ॥ (౪౦)

వామనతుల్యశీలా । అతిమందగతులు నలయుచుంబోయి పసు రాకుల మెసంగిపసియుండు కీటకంబులంబట్టి తెచ్చి తనరూపంబమర జేసి । అంబరతల విహారణంబునుం గుసుమరస పానమై పుణిపాటవం బునుంగరపు తేటిచందంబున లీలా విభూతియందనవరతజన్మమరణ పరంపరలనలయుచు నతిహేయవిషయలోల నధోలోకంబునంబడి కీటకజన్మంబులంది దుర్గతులంబొరలుచున్న అస్మదాద్యతిని కృష్ణచేత నులం బరిగ్రహించి యందటికి నపేక్షానిరపేక్షంబుగానర్చిరాది మార్గ గమన విహారంబును విరించి త్రిలోచన సనకసనందనాది మహాయోగి పర్యాగ్రగణ్యాది మానసంబులకు నత్యన్తదూరంబగు । భగవదంత

రంగ పరిచర్యాచరణయోగ్యాధికారంబు నంగరుణించితివి । నీకరణి నకారణమహోపకారకుల నుభయవిభూతులందు వెదకినంగలరే। శేషనగరాధినాథ రామానుజనమో॥ (౪౧)

మోక్షఫలసంధాయకా । నీవు ప్రాకృతకల్పవృక్షంబవు । నీకావిర్భావస్థానంబైన ఆలవాలంబు ప్రణవంబు । తత్రత్యమధ్యమాక్షరంబు క్షేత్రంబు । ప్రథమాక్షరంబు బీజంబు । అపవర్గప్రాప్తినిమిత్తభగవత్సంకల్పంబుదక సేకంబు అంకురభావంబులుపచతుర్థ్యవ్యక్త భావంబు చరమాక్షరంబుగూఢపాదత్వపంబుమూలంబు అధిగమించిన శాఖలు ఋగ్యజుస్సామాథర్వణవేదంబులు । ఉపశాఖలు తత్తదత భేదంబులు బ్రహ్మసూత్రంబులు పల్లవంబులు విషయవాక్యంబులు పర్ణంబులు । సారసంగ్రహాద్యుపభాష్యాది గ్రంథావిర్భూతిపూచుట। భక్తిపరిమళంబు । ప్రపత్తిమకరందంబు ముముక్షుత్వంబుకాచుట । శలాటుభావంబున నే గాలుట।ఆత్మానుభవమాత్రప్రథమకైవల్యపద పతనంబు పరమపదప్రాప్తి కామితఫలభావంబు । తదవసరసముద్భూతవాసన తన్నిమిత్తాదశఋతార్తి గుణానుభవమాత్రపర్యవసితాధికరంచామరసప్రధాన మధురవిధురావక్వభావంబు । తద్విలక్షణ పరిపక్వభావంబు కైంకర్యపర్యంతాధికారంబు । భగవన్ముఖవికాసావహత్వంబురసంబు అందలి బీజంబ నన్యభోగ్యత్వంబు । ఈదృశామృతాత్మకఫల ప్రదాకృత్వంబు నీ స్వభావంబు అయిన ఫలంబులప్పుడప్పుడేచేర్చు వారర్చిరాదిపురుషులు భోక్తలాదిదంపతులు। నీపరిసరంబున కాచియున్న పాలకుల ప్రాకృతభూసురులుగదా॥ శేష॥ ౪౨

అశరణశరణ్యా । కర్మయోగజ్ఞానయోగభక్తియోగ ప్రపత్తియోగభేదంబున మోక్షోపాయంబులునాలుగుంగని భగవన్ముఖోదిత గీత పాంచరాత్రాది శాస్త్రంబులు బోధించుచున్నవి అందుప్రథమగణితోపాయంబులు మూడును బరస్వరాంగాంగీభావ నిబంధనంబులు అందుజ్ఞానభక్తిసమన్వితకర్మయోగాధికారులు జనకాదులు । భక్తికర్మాన్వితజ్ఞానయోగాధికారులు భంతాదులు । ప్రకృష్టజ్ఞానకర్మ సహకృత భక్తియోగాధికారులు ప్రహ్లాదాదులు । పూర్వోక్తోపాయ త్రితయత్యావృత్త నివృత్తిధర్మరూపసాంగ ప్రపత్తియోగాధికారివి నీవు । నీవేమోక్షోపాయంబని యున్న అధికారులస్మద్దేశికులు। తన్నిరహేతుకాంగీకారమే దాసునకు మోక్షోపాయంబయ్యె ॥ శేష॥ ౪౩

చరమపరమోపాయరూపా। చతుర్వింశద్ద్వాదశాష్టాద్విత్ర్యే
కాక్షరమంత్ర విశేషార్థ గోపనాచాతుర్యంబు గలిగి। నీకు వాచ
కంబై మోక్షైకహేతువైన యీ చతురక్షరినిహ స్తిగిరీశ్వరుండే
ప్రకాశింపించక యుండెనేని। మాదృశదేహధారు లెటువంటి దురవస్థ
లందుదురో గదా యని తద్వ్యతిరిక్తగత్యంతరాభావనిమిత్త విషాద
విస్మయ దర్శకంబగు। శ్రీవత్సాంకమిశ్రుల పద్యరూపసూక్తి। తల్లా
భప్రాప్తప్రమోద నిర్భరత్వంబు నస్మదాదులకనవధికంబుగా నొన
ర్చెనుగదా॥ శేషనగ రాధినాధ రామానుజ॥ ... (౫౦)

చతురచతురాక్షరీ ప్రతిపాద్యా। భగవద్వాచకంబగు నారా
యణేతి శబ్దోస్మియని యెడి చతురక్షరీస్వరూపంబు విచారించిచూచిన
నైశ్వర్యకైవల్య భగవల్లాభప్రదాయకంబౌటచేత చతుర్ముఖ
ప్రముఖ బుభుక్షుజీవ సనకసనందనాది జిజ్ఞాసచేతనపరాంకుశ పర
కాలప్రభృతి ముముక్షుజనసముదాయ సాధారణజప్యంబుగనుక।
రాజపాద్యఖిలాధికారి। సాధారణత్వాది దోషదుష్టంబు। నీకు వాచ
కంబైన రామానుజేత్యేషా యనియెడి చతురక్షరీస్వరూపంబు విచా
రించిచూచిన మోక్షైక ప్రదాయకంబు గనుక। ముముక్షుజనైక
జప్యంబై। ప్రయోజనాంతర రహితపరమసాత్వికజనసాధారణత్వా
కారంబున। పవిత్రతమంబై ప్రసన్నగాయత్రియయ్యె। ఇది ముక్తి
ప్రాయులైన చతురమశరీరులకే సదుపదేశమూలంబుగా లభించు నిత
రులకు లభించునా॥ శేషనగరాధినాధ రామానుజ॥ (౫౧)

గీతార్థప్రకాశకా। మునుపు ద్వాపరయుగమందొక రామా
నుజుండు తనకొక నరుండు శిష్యుడై నిలచినచోట సకలోపనిషద్ర
హస్యసార మర్మముం దేటపరచి యుపదేశించి యతని ముక్తిపదం
బున నిల్పలేడయ్యె। నీవతండుపదేశించిన యర్థముం జెకొనియసంఖ్యా
కనరకమూహంబుల మోక్షపదంబున నిలిపితివిగావున నతనికన్న।
నిన్నే చతురమతిగా విద్వజ్జనంబులు విచారించిరి। ఏతాదృశ మహి
మాతిశయంబుగల నిన్ను సన్నుతింపనేర్తునా॥ శేషనగ॥ (౫౨)

భగవత్కైంకర్యలోలా! శ్రీయఃపతి రామరూపంబైనపుడు నీవు లక్ష్మణరూపంబై తనయందు జేయు శేషవృత్తులకలరి యువరాజ్యపట్టంబునకు నియోగించిన సమ్మతించక శేషవృత్తులే సేయ వాంఛవినుమడించి! నీవు సేయగాజూచి యీ శేషత్వరసంబెటువలెనుండునో గనవలెనని। తథావిధశేషవృత్తులు మగుడి నీయందు దానాచరించ గాంక్షించి యదువంశంబున నవతరించుతరి। నీకు శేషత్వమేకాని పారతంత్ర్యంబు నలదేయుచు శిక్షించు చందంబున రామనామ జ్యేష్ఠభావంబున నిన్నుగైకొమ్మని వాడంబరచి। తాను రామానుజనామ కనిష్ఠభావంబుగైకొనియె। నీవటువలెనే యవతరించినవాడవుగనుక నీకు బారతంత్ర్యంబును గలిగె తాననువర్తించి శేషవృత్తులాచరించనేరక నామమంత్రోపజీవియగుచు। స్వతంత్రుడయి సీతావిశ్లేషజనితక్లేశంబెల్ల దీర్చుకొను వానివలె యథేష్టంబుగా గామరసలోలుండయ్యెగాని శేషత్వరసలేశంబైన నెఱుంగడయ్యె। స్వతంత్రులును విషయప్రవీణులును శేషత్వరసంబెఱుంగుదురే। యెఱుంగకగాన శేషత్వంబబ్బునే యెంతలేదది నీకేయసాధారణంబు। నిన్నుజూచి నేర్చుకొనదమనిన నీశ్వరునికైన నలవియగునా॥ శేషనగరాధినాథ॥ (౧౩)

అప్రమేయస్వరూపా। నీవాదిశేషుండవు। నియాకారంబులనేకంబులన్నియు భగవద్భోగోపకరణంబులు। యందుకొన్ని ముఖ్యంబులు। అవివిన్నవించెద। అష్టోత్తరశతస్థానాది సమస్తదివ్యదేశంబులంగల వేదశృంగానందనిలయపుణ్యకోట్యాదిసంజ్ఞక విమానరూప నివాసంబులునీవ। తుంగవిమలవిశాలశ్లక్ష్ణతూల హంసతూలికాది కల్పతల్పంబులునీవ। మహార్ఘ్యమణిమయ ప్రధానసింహాసనాదిసమస్త దివ్య పీఠంబుల నానావిధ విచిత్రనూత్నరత్ననీలమణిమయపాదు నీవ। కాయుగళినీవ। మణిశ్రేణీసందసముచిత తత్తన్మధ్యప్రదేశప్రకాశమానముక్తాళియుక్తాంచలపీతాంబరంబునీవ। నానాక్షేమకృతసవ్యోపధానంబులునీవ। దివ్యాతపత్రపఙ్క్తీ, విశేషంబులునీవ। మణిమయ కరదీపికాదీపపరంపరంబులునీవ। యివ్విధంబున స్వచైతన్యంబుతో

చకుండ నచేతనప్రక్రియనుండు శేషవస్తుస్వరూపంబని చూపుచున్న సకలేతరవ్యావృత్తజ్ఞానానుష్ఠాన పరిపూర్ణుడవుగనుక । జ్ఞానిత్వాత్మైవమేమతమిత్యుక్తమర్యాదనుయథేష్టశేషివి । నియజ్యమానత్వేనతదంతర్యామిత్వంబునుంజెందుచు । భగవదంతరంగబహిరంగంబులనతిశయకరుండవై వెలుగుచున్నవాడవు । నిన్నెవరికిందెలియశక్యమే ॥శేషనగరాధినాథ॥ (౧౮)

సర్వాతిశయితాకారా । నీయాథాత్మ్యంబు విచారించిచూపిన శేషాత్మకుండవుగనుక । చేతనపరమచేతనావిశేషంబుగ నందఱికి శిరసావాహ్యుండవు । అదెట్లన్న వివరించెద । భగవధ్యానమున నేయ ప్రతిపాదితరీతిని । బరమపురుషపాదుకా రూపావిర్భావంబు నొంది యుందువుగాన । శ్రీభూనీళాది దివ్యమహిషివర్గశేషాశనాది నిత్యసూరి సంఘపరాంకుశ, పరకాలాదిదివ్యసూరి. నివహ చతుర్ముఖ పఞ్చముఖ షణ్ముఖ ప్రముఖాగ్నిముఖసమూహసనకసనందనాది మానిసందోహ ప్రహ్లాదనారదపరాశరాదిపరమభాగవతవ్రాతనాథయామునపూర్ణా గురువరప్రకరకూరకురూకేశాది ముముక్షుజనగణాస్మదాది సమస్తచేతన పర్యంతంబు గశిరసావాహ్యుండవు। కౌస్తుభత్వాపన్నజీవస్వరూప ప్రతిపాదకమకారంబు నకుముఖ్యవాచ్యుఁడౌటచేత నీవేమాణిక్యాదిరూప తన్మయకిరీట మకుట వేషంబమరి। భగవంతునకు సిరసావాహ్యుండవు। యీ ప్రకారంబున సమానాధికరహితుండవహో॥ శేషనగరాధినాథ॥ ... ... ... (౧౯)

సర్వసర్వజ్ఞ శిరోమణీ। విచారించిచూచిన భవత్పాదుకాకారంబున పరిణమించిన మహామహుండవు। నీవుతత్ప్రసిద్ధిదానందికొని శఠకోపసూరి సమస్త దివ్యదేశంబులను వెలసె। యిది మహావింతయయితే కొదువయేమి మీ యిద్దరికీ భేదమే లేదు కాబోలు। కలిగియున్న నీకున్నసకిన్నప కు ంనయనిరూపైక్యంబేల సంఘటించు శేష॥ ... ... ... (౨౦)

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



భగవత్పాదుకాకారా। యపరాజిత సాకేతాఖ్యాలనయోధ్య లురెండు। ప్రథమాయోధ్యయందు నీయాదిరాజ్యంబు। పరబ్రహ్మాది రాజ్యపురస్సరంబు ద్వితీయాయోధ్యయందు రామశబ్దాభిధేయ పర బ్రహ్మాది రాజ్యంబు త్వదాది రాజ్యపురస్సరంబు అదిత్వదాకార భేద పాదుకాగ్ర్యాభిషేకంబున నేనువ్యక్తంబు।ఏవంరూపోభయవిభూతి నాయకత్వాధికారంబున నవ్యవధానంబై నకతంబున నిదిపూర్ణావతారంబు। యిందుకునూటఎనిమిది తిరుపతుల యందు భగవద్భోగంబులు। నీ యాజ్ఞాసిద్ధంబులౌటయుముముక్షువులకు మోక్షంబు। నీయనుజ్ఞాసిద్ధంబౌటయు సాక్షి వివాదంబేలనే॥ శేషనగ రాధినాథ॥(౫౭)

ప్రణవప్రతిపాద్యా। కారణంబగు శేషి।ప్రథమవర్ణార్థంబు శేషత్వ నసిద్ధ శేషవస్తువైన। నీవుతృతీయ వర్ణార్థంబు యివ్విధంబున మీరిరువురు ప్రథమచరమవర్ణంబులం ప్రణవ శరీరమందు నెలవుకొన్నవారలే। మీరిరువురుంబుమ శబ్దవాద్యులే మీరిరువురు సహప్రశీర్షత్వాదిలక్షణలక్షితులే మీరిరువురు ననంతాఖ్యగలవారలే। యయిననుందకారణ వస్తువిష్ఠ శేషత్వనిరూపక వస్తువునీవగుట చేత। తత్వదర్శిగణంబునిన్నాదికారణంబని నిశ్చయించె। యిందుకు సాక్షి నీ పేరిటి విష్ణుసిద్ధాంతంబు వెలయుచే సుమీ॥ శేషన॥ (౫౮)

శేషావతారా। నీ స్వరూపంబంటిమా। శేషత్వ ప్రతిసంబంధి రూపాదిద్వంద్వంబునకు శేషత్వపూర్తి ప్రథమ ప్రతియోగివై శేషసాక్షిక ప్రసిద్ధి వహించు। నిజంబయిన నీరూపంబంటిమా। త్రిపాద్విభూతియం దచింత్యాద్భుత దివ్యరత్న స్తంభ సహస్రగంభీర మహానంద నిర్భర మహావకాశ మణిమయాస్థానమంటపములోపల। ధర్మాదినిర్మితనిర్మల రత్నపీఠోపరిప్రదేశ ప్రకాశమాన సహస్ర దళ పుండరీక మధ్యగస్వర్ణకర్ణికాగ్రభాగంబున। పరవాసుదేవ భద్రపీఠాసనాసనంబగుచు। తదాది రాజ్యంబుపై శూన్యదైన్యంబై ఫణసహస్రంబుల ప్రవర్తించు నీ జ్ఞానంబంటి వారమారమణవిహరణ సమయసముచితా శేషవృత్తులన్వయించుటకు। తదాశయంబు

యథావస్థితంబుగా సాక్షాత్కరింపించు। నీ బలంబంటిమా। దంష్ట్రాయు మానాత్మ భోగాగ్రభాగ సంఘటితంబు జేసి। మధ్య కీలితమణిఖచిత శాతకుంభకుంభాయమాన బృందారకాలయాలంకృత సప్తసాగరాంతరీ సచక్రవాళ భేదభిన్నోత్తరోత్తర ప్రగుణిత ప్రవేశ రేఖావలయ వరంపరావలయిత సర్వసర్వంసహా చక్రంబును। విశచవిచిత్రాతపత్రంబు లీలను ధరించు। నీవిభూతులంటిమా। భోగలీలార్థవిభూతిద్వయా నేకాత్మ సంకల్పానుగుణానేక శరీరపరిగ్రాహివి నీవేయనుటచేత। 'నుభయవిభూతిపరిదృశ్యమానరూపంబులన్నియు నీ వేయైకనుపించు। ఏవం స్వరూపరూపగుణవిభూతులుగల నిన్ను వర్ణించుట తనకు శక్యమా యని యాత్మవిచారించు వర్ణించకయుండ శక్యమాయని జిహ్వాగమకించు। బుద్ధినూహించు। మానసంబు సంకల్పించు। యీ సాహసంబునీవే సహించు సహించుమీ। శేషనగ॥ ... ... (౫)

అమితమహిమాకారా। శ్రీమదష్టాక్షరప్రకాశకత్వంబున నరోపదేష్టయైనబదరీనారాయణుండు। దక్షిణోత్తర భేదంబునతనకాశ్రమంబులు రెండు। యిదియుత్తరంబు। దక్షిణాశ్రమంబు సంహ్యాద్యోత్తర భాగంబున। సంహ్యాపర్వత పూర్వంబైన యాదవాచలంబు। అందు జతుర్యుగంబులందనకు శేషుడయి శేషవృత్తిచేయు వాంఛచేత ప్రథమ యుగంబునందానె సహస్రఫణామండల మండితంబగు నిజాకారంబుతో వచ్చి। ద్వితీయయుగంబునందు దశరథపుత్రుండై। లక్ష్మణాకారంబునవచ్చి। తృతీయంబైన ద్వాపరంబున వసుదేవ సూనుండై! బలరామరూపంబునవచ్చి। సకలవిధ శేషవృత్తులునుం జేసి। యీ చతుర్యుగంబున నొకడుగా గలిగియున్నాడని యానతిచ్చిన నారదీయ పురాణసిద్ధ భగవద్వాక్యంబున కర్థంబు। నీవే యనుటసువ్యక్తంబగునట్లు. ఢిల్లీ నగరాధిపయవనభీరీ కృతస్థలంబున తదధిసంధిసమయ ప్రతిష్ఠిత బుద్ధ ప్రతిమోద్ఘాటనంబు సేయించి। మూలనారాయణ ప్రతిష్ఠాపన పూర్వకంబుగా। గర్భగృహాంతరాళాది సకలమంటప ప్రాకారగోపుర సరోవరారామాదినిర్మాణం

బులనుం జేయించి। ఢిల్లీ నగరంబునకుం జని। రామప్రియులం దోడి
తెచ్చి। యథాపూర్వకంబుగా సకలోత్సవంబులను గల్పించితివిగనుక
విద్వజ్జనులు నిన్ను శేషావతారంబని నిశ్చయించిరి। మీరును మీ
శేషత్వంబు యాదవాచల మాహాత్మ్యవ్యాఖ్యాన సమయంబున దాశ
రథీ ప్రముఖాంతరంగ శిష్యులకు గంఠోక్తముగా బ్రకాశంబు జేసితి
రటగదా॥ శేషనగరాధినాథ। ... (౬౦)

రామచంద్రప్రియా। పఙ్క్తిరథ గర్భంబునజనించిన । భగ
వంతునకు నీవనుజుండవై యున్ననాడు। భరత. శత్రుఘ్నులు తదను
జులై యుండినను రామానుజత్వంబు నీయందే రూఢంబై నిలచె
రాముండు। జననీజనక సాకేతనగరతదాధి రాజ్యతదుచిత భోగంబు
లన్నియు విడిచి వనవాసంబు జేయుచు। సీతను విడచిన వేళయందు।
నిన్ను విడువడయ్యె గావున తద్దాత్మ్యమూలంబు పూర్వోక్తజననీ
జనక ప్రముఖ సకల విషయంబులకన్న నీవేయని విదితంబయ్యె। యది
కారణంబున సకలేతర విలక్షణ పరస్పరా పృథక్సిద్ధభావంబుల వ్యక్తీ
భవించినవారు మీరిరువురున్నారకదా। వేదోపబ్రహ్మణంబును దరు
ణారూపసంపన్నాదిత్యాది ప్రక్రియచేత వర్ణించె నేమసవచ్చు
॥ శేషనగరాధి। ... ... (౬౧)

అనంతావతారా। నీవు దాశరథివై ఆవిర్భవించిననాడు మీ
పెద్దన్న పితృవాక్య పరిపాలనార్థంబు వనవాసంబునకై గమనించు
వేళ తత్సహధర్మచారిణియగు సీత తానునుగూడి రాదలంచినంజూచి
నగరారణ్యావాసంబుల వాసి దెలపి వద్దు నిలువుమనిన। తనకు తత్సం
శ్లేషవిశ్లేషంబులు స్వర్గదుర్గతికల్పంబులని సుఖదుఃఖ రూపం
బులుగా బలికి। ఆయమ్మ తన యభిప్రాయంబు తేటపరచి। నగరం
బున నిలువక వెంబడిగా నడిచె। నీవునుగూడ రాగని పితృనియమంబు
లేని వనవాసంబు నీకేల నిలువుమనిని నిన్ను విశ్లేషించి జాలాదుద్ధృ
తమత్స్యంబుగతి, ముహూర్తమాత్రకాలంబునకన్న మించి బ్రతుక
గలనేయని నీ యభిప్రాయముం బయలు జేసి నిలువక వారిననుసరించి

గడిచితివి। విచారించిచూచిన జనకాధికారంబునకు నీ యధికారం
బునకు నింత తారతమ్యంబున్నది। నడవళ్లున్న దువులకై వడులే ఆమె
నాయమ్మ విశ్లేషించి దుఃఖించిన మాత్రమే కాని శరీరంబు నిలిచె।
నీవు విశ్లేషావసరంబున చోత దేహంబు నిలుపవైతివి అతండు జానకీ
విశ్లేషంబు సహించియుండె। నీవిశ్లేషంబునకోర్వడయ్యెగావున। నీవే
విరాట్టికన్న నత్యంత ప్రియుండవై తివిగదా॥ శేష॥ (౬౨)

ఖలవినాశకా। నీవు సుమిత్రా పుత్రుండవై యుండునప్పుడు
నీకు శరణుజొచ్చి సుగ్రీవుండు రామ నిగ్రహంబు తప్పించుకొనెనట।
వాయుబీజంబై ముందరికి బ్రహ్మగాగలిగియున్న హనుమంతుడా
నాడే నిన్ను రణరంగంబులో స్కంధంబుపై నుంచుకొనెనట। ఇంద్ర
జిత్ప్రభృత దేవద్వేషుల నీవే సంహరించితివట। రణంబులో మూర్ఛి
తుండవై యున్న సమయంబున రావణుండు తన పరివారంబుతో
గూడవింశతి భుజంబులచేతను నిన్ను లేవనెత్తనేరక తొలగెనట।
ఏతాదృశ మహిమంబుగల నీవే వసుదేవ గృహంబున బలరామా
కారంబు వహించి కొన్ని ఆశ్చర్య కార్యంబు లొనరించి యీ
యుగంబున నాసూరి కేశవాచార్య గర్భంబున జనియించి। అని
తర సాధారణ కార్యంబులాచరించి। భగవత్ప్రకాశిత ప్రభావుండవై
యుండగాజూచియుం గొందరు రామకృష్ణాదులయందు మానుష
మనీష చేసి నిదించిన చందంబున నిన్ను మానవమాత్రునిగా నెంచి
యనాదరింపుచున్నవారు। వారందరు నాసురప్రకృతలేయని బాసచేసి
గెల్వవచ్చు నిందుకు సందేహమా॥ శేషనగరాధి॥ (౬3)

రామానుజవిన త్రిస్వభావా। త్రేతాయుగంబునబదునొకండు
వేలేండ్లు రామామోద మూలంబులయిన యాడిగంబులు వదకి
చేసిన మహానుభావుండవుగాన। తత్ప్రభావంబును నీ యవతారం
బును విడువక। ఇక్ష్వాకుకులదైవతంబగు రంగనాయకులకుపరిచర్యలు
చేయుట రామముఖోల్లాసకారిగా విచారించి శ్రీరంగంబుననే వసించి
తద్వల్లభకైంకర్యంబులు నిజాజ్ఞాక్రమంబున తప్పకనాచంద్రార్కంబై

నడచునట్లు దిద్దితివౌర॥ శేషనగరాధినాథ॥ ... (౬౮)

భూతపురీనిలయా। మీకు భాగినేయతనయుండైన కందాడ యాండాను మీయవతారదేశంబగు శ్రీపెరుంబూధూరిలో మిమ్మర్చ్యారూపంబున నభిముఖంబుచేసుకొనవలెనని తలంచిన వేళ। నేత్రోన్మీలనముహూర్తమందక్కడ। శ్రీరంగంబునందు శిష్యులకుపన్యాసంబుసేయుగా। నదరుపాటున కోకనదపత్రంబులకరణి నరుణంబులయిన మీనేత్రంబులుసేవించి! విస్మయాకులాంతరంగంబుల నిదియేమని యడిగిన। కూరేశాదులకు అండానుకృత్యం బిందులకుగారణంబని యానతిచ్చితిరట। యోగసంసిద్ధి సౌభాగ్యాదులను మించినజ్ఞానవ్యాప్తిచే తదదాకారంబునందును సాకారంబునందుంబలె నేకాకారవ్యాప్తిగనుపింపజేసితిరి। ఇది మాదృశప్రాకృతు లేమని తెలియ నేర్తురే। శేష॥ (౬౯)

తత్వజ్ఞమనోహరా। హస్తిగిరియందు మీరుతురీయాశ్రమస్వీకారంబునేయువేళ। దాశరథికూరేశులు దక్క దక్కినసమస్తదేహసంబంధులతోడ సంగమంబును విడిచితిననిపలికిన। సమీపమునవున్నవారయివారిరువురువచ్చి। ప్రథమోపాత్తశిష్యులయి ఆశ్రయించి చందానువర్తిత్వంబున పాదుకాజలవారణకారత్వప్రసిద్ధి వహించిరి। మీయభిప్రాయంబుచేతను త్రిదండయజ్ఞోపవీతంబులుగా నాచార్యసన్నిధినివర్తితులైరి। ఇత్తెరంగున నవినాభూతధర్మవద్వినియుజ్యమానులై జగత్పూజ్యులౌటకు గారణంబు భగవత్కృతవరణంబులు గదా॥ శేషనగ॥ (౭౦)

ప్రపత్తియోగస్వరూపజ్ఞా। పేరరుళాళరు నియమనప్రకారంబున। మీరుపెరియనంబిగారిని ఆశ్రయించవలసి కోవెలజేరుటకై కాంచీనగరంబువెడలి। నాల్గుప్రయాణగతిని మధురాంతకంబులో జక్రవర్తితిరుమహన్ కోవెలప్రవేశించిప్రదక్షిణంబుసేయుచు, నచ్చోటి తప్పుడేలరిటెంచియున్న పూర్ణాచార్యులంగని సాష్టాంగదండప్రణామంబుచేసి। అడవోయినతీర్థమెదురుగావచ్చినన్నకరణి నిటువలె

యుండవలదేయని ఆశ్చర్యహర్ష కబళితాంతః కరణంబున। తదంఘ్రి యుగళంబు సిరంబున నిడుకొని। ఆనంద బాష్పంబులొలుకపులకాంకిత గాత్రంబున। గద్గదస్వరంబుతో స్వాభిప్రాయంబెరుకపరచిన। ఆతండు మంచిదే రేపటివలెనే వరదుని సన్నిధినయ్యావనిన తావత్పర్యంతంబీ దేహంబు స్థిరంబనియుండు నేడిందుల కాళవందారు పనియెసాక్షిగాదే। సర్వజ్ఞులైన మీరెరుంగరేయని। పరమార్తి నిగుడ మగుడవిన్నవించగా। అతనికి దయజనియించి యథావిధి ననుగ్రహించగా। అప్పుడే పంచ సంస్కారంబులు లభించితిరట। యిది విచారించిన దేశకాలాది నియమంబులేనిది లేమియుగా గలిగిన నీ ప్రపత్తియోగంబని! నీవే ప్రకాశింప జేసిచూపినట్లుండెనౌరా భళీ। శేషనగశాధినాథ ? ॥ (౬౭)

అకించనజనాధారా। బాల। మూగ। అంధ! జడ! పంగు! బధిరులు। పరగత స్వీకార సౌభాగ్యులని యెడి శాస్త్రార్థ ప్రవర్తనంబునీ వలననే గలుగబిని పెద్దలు నానతిచ్చిరి। ఒక మూగము ముముక్షుత్వంబున మీకు శిష్యుడై మోక్షోపాయంబు దెలుప వేయనిసంజ్ఞచేసి అడిగి పరమార్తితో బరితపించగా జూచి। మీరుచిత్తంబపారకరుణాయత్తబయు అతని నేకాంతప్రదేశంబునకు దోడ్కొనిపోయి యిదిమోక్షోపాయంబని యొక అర్థంబుకృపజేయగా నదివలుగాణిసందుల నాళ్వారును సేవించి యీజన్మమెత్తక మూగనైజనించినతనకు సీలాభమేఘటించెగదాయని కాంక్షించెనట। తదనంతరంబ మూగయుందల్లడముడిగి। నెమ్మదిని మీయందు బరతత్త్వప్రతిపత్తిజేసెననివింటి। నేనుబాలుండ। నకించనుండ। నగతికుండ। నన్ను తాదృశ దయాపాత్రునిగాజేయుముతండ్రీ!! శేషనగరాధినాథ॥ ... (౬౮)

కృపామాత్రప్రసన్నాచార్యా। అనాదివిషయవాస నాబలమున విపరీతరుచిభూయిష్ఠుండనై। హితాహితవిభాగజ్ఞానవిదూరుండ

నగు నన్నుజూచి అనర్థవర్థకంబైననా వృత్తిజూచి । అపరిమిత సద్గుణాకరుండగు నిన్నుజూచుకొన్న నన్నుదయచేసి రక్షించుటమేలు నీకదేఘనతగాక । పరించిరక్షించెదనని । మటిమటి జూచిననాయందాత్మగుణంబులు కనిపించునా । కనిపించవు । అంతమాత్రమే కాదు । నీవునన్ను రక్షించనైతివేని నీయంతరంగులే నీదయనేమని విచారింతురో । అదివిచారించుకొనుమీ॥ శేష॥ ... (౬౯)

నిజజన కామాదిదోషనివారకా । ఫాలలోచనరోషాన లభస్మీభూతసజాంగంబగు ననంగగహంబు మదీయాంతః కరణంబునందావేశించి వెంటంబడి జన్మ జన్మాంతరంబులను విడువక । జాగ్రత్స్వప్నదశావిభాగంబు లేక పీడింపుచున్నది। ఆత్మనాథుని యొద్ద జేరనీయదు అతనితోడిభోగం బెటువంటిదో యెన్నడు నెఱుంగను । సర్వకాలంబునుండి దీనిచే జాలాకృశించిడస్సితి । యిదియెటువంటి భగవన్మంత్రంబులనువీడదు । పుణ్యతీర్థా చరణంబుల నుంబోదు దివ్యదేశ సంచారంబులచేతనుం దెమలదు యేమిసేతు । నీవు నహాయోగి వర్యుండవు నీవై తేదీనివిడిపింతువని వరవర యోగి ప్రముఖులానతీయగా దెలిపితి । నిన్ను సందర్శించినమాత్రంబున బ్రహ్మగతకున్నలు మొదలువిడిచికదిలెనట। ఇకనీ వేగతి నీసన్నిధిజేరితి నీకుశరణంబుజొచ్చితి నీశ్రీపాదరతులు నాశిరంబునకాపుగాబెట్టి । తావకచతురాక్షరీమంత్రంబు నాజిహ్వా యంత్రంబునవ్రాసి । ఈగాసి బోజేసిననీవాసి దిగంతంబులవర్ణింతు । నేనుతరింతు । సుఖింతు । ననుగ్రహించుమీ॥
శేషనగరాధినాథ॥ ... ... (౭౦)

ద్రావిడ వేదప్రభావ వేదీ । చోళరాజ భయాపదేశంబున వెళ్ళుచారిమీరు మేలునాటికి బ్రచ్ఛన్న వేషంబులో బోవుతగిని । తత్కింకరులు తరుముకవచ్చి వెన్వంటికలియగా నప్పుడు తదభిముఖుడై నిలిచితట్టునభట్టనాథ విరచిత ప్రబంధంబునందొక పాశురంబునుడివి ఇసుకచల్లివారలదృష్టికి గొండ యడ్డంబయి నిలిచినకరణినుండజేసి

మీఁగుమీఁపరివారంబునుఁగూడ నవ్వలికిందాటితిరట । ఈకృత్యంబు
విచారించినయాళ్వారుల దివ్యప్రబంధశక్తియెఱిఁగిన నధ్యవసాయ
నిష్ఠులకన్నిపాశురంబులు మాత్రకల్పంబులేయని చూపి చాటించిన
యందమో కాకశత్రునిరసనసమయంబును గనుక లక్ష్మణబలరామా
వతారంబులనుం గనుపింపంజేసి । యెవ్వరికిని జన్మాంతరవాసన
విడుచునేయని యభినయించినచందమో తెలియుదీయభివృద్ధిసందేహా
స్పదంబై యున్నదంతటికిం దెలియపరచవే॥ శేషనగరాధి॥ (౨౧)

జయజనవిషధరవిహంగపుంగవా । మీరుమేలునాటికివి జయం
బుచేసినపుడు । శిష్యుడైన తొండనూరినంబినా శ్రీపాదతీర్థంబొసఁగి
తత్ప్రభావంబున । ఆనగరంబేలుచున్న రాజుకూఁతురినిబట్టిన బ్రహ్మ
రక్షస్సును విడిపించెనట అదికారణంబున నా రాజు మీకుశిష్యుడయిన
విష్ణువర్ధనుండని పేరు పెట్టి యభిమానించినంజూచి తదీయులైన జైన
మతస్థులందఱుగమ్మికొని । దొమ్మిగూడి వాదమ్మునకురమ్మనిన
వేదంబునిందించి మీరు ముఖాముఖీకసయోగ్యులుగారని । యాస్థాన
మండపమున దెరమఱుఁగుజేసికొని వసియించి నిజంబైన శేషాకారంబు
గైకొని సహస్రముఖంబులనజైన సహస్రంబుగ్గడించు యుక్తికోట్లను
విదళించి । పరాజయంబ నొందించి । అందఱికిం దత్కృతపరిజ్ఞానిశ్చ
యక్రమంబున గలుగ గానుగలాడించి । యేనూటయెనుబదిజైన
ప్రతికూలయంబులను విదళింపించి । ఒకమహాతటాకఘటనం బొన
రించితిరట । యెటువంటి యాశ్చర్యకరంబులే॥ శేష॥

ముముక్షుజనసమాశ్రయణీయచరణా। త్వదన్యదైవభావనాగం
ధదూరుడైన యాంధ్రపూర్ణుండు । స్వరూపంబుత్వదేకశేషంబను ।
నుపాయంబుకారభత్వదంగీకారంబును । పురుషార్థంబుత్వన్ముఖవికా
సావహకైంకర్యానువర్తనంబుగా స్వరూపోపాయ పురుషార్థయథా
త్మ్యంబులు నిష్కర్షించిన మహామనస్కుడు గనుక తద్విజ్ఞాపితార్థంబం
గీకరించి, తదభిమతప్రకారంబున భావిముముక్షుజనోజ్జీవనార్థంబుగా

స్వస్థలంబగు శాలాగ్రహాఖ్యగ్రామంబున। స్వచరణారవింద ప్రతికృతియును। స్వకీయశ్రీపాద తీర్థపరిపూరితశాతకుంభ ప్రవేశప్రకాశమాన స్వాంతరత రంగాయమాన ప్రశ్రవణవారినిర్ఝర పూరంబగు కాసారంబునంగరుణారసంబుప్పతిల్ల ననుగ్రహించితిరట। మీదయాపరత్వంబతని పరతత్వంబును వర్ణించశక్యమా॥ శేష॥

భక్తాతిశయితాకరా। తనకన్నతనదాసులేయధికులౌదురనుట గుహ। శబరీ। విదుర। కుచేల। వైదిక। నారదాదులయెడల తాను బహుమతి పూర్వకప్రపత్తులు చేసి చూపిన భగవంతునిచందంబున। నీవు నీదాసులలో। బిళ్లైవిరంగాయుల్లి దాసులకరంబునం బట్టి। అతండు పావనపావనుడగుటకు దేటపరచితివి। ఆతనిపత్నియెడలతత్వార్థనిష్కర్షలు దెలియుటకై శ్రీవైష్ణవులనంపించి తద్గతజ్ఞానపూర్ణత బయలుచేసితివి। యొంబారకునీయధిష్ఠానంబే యొసంగితివి దాశరథిసూరినందటికి శిగసావాహ్యునిగా నొనర్చితివి శ్రీవత్సాంకమిశ్రులవలన ముక్తికరస్థలంబైనది యని యనుమోదించితి। ఈవింతలు విన్నంతమాత్రంబున నాసునికి మతిమతినోరూరుచున్నది నన్ను మీవారి యభిమానాంతర్భూతునిగా జేసి వారల పంచలుగాచియుండెడి భాగ్యం బొసంగను నాకదేపటి వేలుసుదినా॥ శేష.నగశాథ॥

(౨౮)

అమానవస్తుత్యా। ద్వాత్రింశల్లక్షయోజన విస్తారంబగు క్షీరసాగరంబులో బవ్వళించియున్న యనిరుద్ధస్వామి యొక్క దివ్య మంగళ విగ్రహంబు సార్థద్విలక్షయోజన దీర్ఘంబట। నీవతనికి దల్పంబై యుడువాడవేనట। నీయాకార విభవంబెంతనవచ్చు। నీ కరణినిటువలెనంతరంగ పరిచర్యాచరణంబున కర్హులుగాక తత్పరోభాగంబునకు రాగూడక। బ్రహ్మేంద్రాది దేవతలహంకార గ్రస్తజీవులుగావున। హిరణ్య రావణాది దుష్టరాక్షసరాజలోకవధార్థంబాయనిరుద్ధస్వామిని గూర్చి మొరయిడ వచ్చినప్పుడుత్తర కూలంబుననే పడియుందురట। వారికిని నీకు నెంతటి తారతమ్యంబున్నది। వారియు

హంకార గ్రస్తతద్దత్స్వస్వపరాధికారంబులుగల వారై యుండియు కృతఘ్నులై గర్వించి, తత్పాపిదుర్భావ విశేషంబగు శ్రీకృష్ణుని యందు జేసినవత్సాపహరణశిలా ప్రవర్షణాది కర్మంబులచేతనే సకల లోక ప్రసిద్ధంబు। అటుగనుక నీకుగింకరులైనవారా బ్రహ్మాది విభూతులన పేక్షింపక తృణీకరించి వారలచేతనే పూజలందుచు। పరమ పదారోహణంబు జేయుచున్నారు॥ శే ॥ (౭౫)

భవబంధమోచకా। సత్య సంకల్పాది విశిష్టంబగు పరబ్రహ్మంబు సృష్టిస్థితి సంహార సంసార విమోచనాదులకుదానేకర్తగావున సృజించ నవసరంబైన నిజేచ్ఛనే చతుర్ముఖుని సృజియించితదంతర్యామియై దక్షాదుల జపంపించి తన్ముఖంబున జగజ్జీవుల గలిగించి సృజియించుచు। స్థితికి దా విష్ణుత్వంబునొంది మనుముఖ్యాధికారుల కాత్మయైధర్మోపదేష్ట యగుచు, జననీజనక దేశికభూపాల దానశీలజనాదిముఖాలంబుగా పాలనంబుసేయుచు। సంహరించసమయంబై నచో పంచాననాంత కానలప్రముఖత త్తజ్జంతుజాలాంతర్యామియైసంహరించ గలిగి। సంసార విమోచన నిమిత్తంబు సహస్ర వదనావతారుండవగు నీయందు నిలచిన నీవు పూర్వోక్త చతుర్ముఖ ప్రముఖ సమస్తబద్ధచేత నవ్యావృత్త సత్వనూరి శ్రేష్ఠుండవు। గనుక తన్మనోరథపూర్తి జేయుటకు స్వశిష్యభూతచేతస్సప్తతి సంఖ్యా సంఖ్యాత సింహాసనస్థిత త్తచ్ఛిష్యప్రశిష్య పరంపరాభి ముఖంబున బద్ధాత్మలకు ముక్తి యొసంగుచున్నాడవు। చతుర్ముఖాదులకును నీకుం దారతమ్యంబు విచారించిన గాగారగృహనిర్మాణ కామరూపమానాధికారంబు వారిది। కారాగృహాబద్ధ జనవిమోచక యువరాజోపమానాధికారంబునీది। యిది సారసజ్ఞులై వివేకించ నేర్చిన నిమత్సరులకు దెలుసును। నితరులకు దెలియదేమి చిత్రమో। శేషనగరాధినాథ॥ (౭౬)

భగవద్లీలతత్త్వావతారా। పరమవ్యూహ విభవాంతర్యామ్యార్చావతారా చార్యరూపంబున షడ్విధ ప్రకారభేద భిన్నంబీశ్వర స్వరూపంబు అందు పరవ్యూహంబులు రెండు నిత్యము లైన భోగ్యంబులు

గావున దేశవిప్రకృష్టంబుల విభవంబు తత్కాల సన్నికృష్టైకమాత్ర గోచరంబు గనుక, కాలవిప్రకృష్టంబు అంతర్యామిత్వంబు యోగసంసిద్ధపరిశుద్ధజనానుభావ్యంబైన కతంబున కరణవిప్రకృష్టంబు అర్చావతారంబనాలోచిత విశేషాశేషలోక సంభావ్యంబగుటచేత, దేశకాలకరణవిప్రకృష్టంబు గాదు! అయిననునజ్ఞాతజ్ఞాపనాద్యదర్శకంబై షష్ఠప్రకారంబువంటిదకాదయ్యెంగాన! పూర్వోక్త పంచప్రకారంబులకన్న సమస్తలక్షణ ప్రశస్తసర్వోత్తర చరమస్వరూపంబవగుదిదిసర్వసర్వజ్ఞ సరసజన సంభావనీయుండవైతివి! యెటువలెనంటివా బీజభూతేక్షుఖండతద్భూతరసాలదండతత్సారసాకార రసపూరితత్పరిపాక పరిణతశర్కరా ద్రవ్య తత్పాకావస్థావిశేషంబని భూతఖండశర్కరా వస్తువులు త్తరోత్తర పర్యాయతయాజన్య జనకభావ సిద్ధంబులే అయినను సర్వోత్తర రూపఖండ శర్కరే శ్రేష్ఠమైన సర్వైస్స్పృహణీయమయ్యెంగాదె॥ శేషనగరాధినాథ॥ ... ... (22)

గురుపదమూర్ధాభిషిక్తా! ఘటకత్వోపాయత్వభేదంబున ద్విప్రకారాచార్యాత్మకంబాచార్యత్వంబు, అందు ప్రథమ ప్రకారాచార్యత్వంబుప దేష్టత్వ విశిష్ట సర్వగుణ సాధారణంబు! ద్వితీయ ప్రకారాచార్యత్వంబు! వ్యవస్థితంబు! అది నీయందే సాధారణంబైయుండు నెట్లన్నను! శేషియైన యతండే తనపదంబున నిన్ను నిలిపెంగావున నీశ్వరాభిప్రాయ లబ్ధంబౌటచేత నిది సత్యప్రదాయకంబని సర్వపూర్వాపరాచార్యానుష్ఠాన క్రమంబును, తాదృశంబుగా బెద్దలు నిర్వహించుచున్నారు, ఏతద్విపరీతోపాయాత్మ కాచార్యత్వంబులెల్ల స్వస్వాతంత్ర్యసంపాదితంబులట! వారును వారిసంబంధులును, జేరుచోటెదియానతీయవే॥ శేషనగరాధినాథ! ... ... (23)

సర్వాచార్యసమాశ్రయణీయా! కారణభూత సర్వేశ్వరుండే శేషిగావున నతండు సర్వ సమాశ్రయుండయ్యె అతండు జ్ఞానాత్మకుండుగనుక, అతని కనురూపంబయి యథేయత్వ శేషత్వరూప శరీర

లక్షణంబులతోడనజననంబైన దివ్యమంగళవిగ్రహంబయ్యె. శఠవైరి తదీయచరణకమలయుగళాకారంబమరియున్నవాడవు నీవు యిట్లయినచో శేషసమాశ్రయణసిద్ధచరణసమాశ్రయణద్వారంబయ్యెగా వునదచ్ఛరణస్థానంబునీవే. శేషభూతసమస్త చేతనసమాశ్రయణుండవైతివి, యిటువంటినిన్ను విడిచిభవదాశ్రయణీయంబు చేసితిమనగూడునా. అటువలె జేసినదురహంకారులు భగవత్ప్రసాదపాత్రులౌదురా. శేషభూతసమస్తచేతనా॥ శేషనగరాధినాథ॥ ... ...(౭౯)

సర్వోత్తమోత్తమా. బ్రహ్మరుద్రేంద్రాది దేవతాజాతములో విష్ణువధికుండని వేదంబులు ఘోషింపుచున్నవి. తదుపబృహ్మణంబులందతడు తనకన్ననన్యార్హ శేషభూతులైన దాసులే యధికులని శాసింపుచున్నాడు. తాదృశప్రభావముగల పరాంకుశనాథయామునాదులు నిన్నే అధికునిగా దెలిసి. తాము నీవారై అందరికిని నిన్నేచూపి చాటిరిగనుక నీవు సర్వోత్తరప్రభావసంపన్నుండవగుటకు నిస్సందేహంబు. యీధర్మజ్ఞానమయంబు విశ్వసించి యితరంబులుమాని త్వదన్యవిముఖుండై నీవే దైవంబని నిలచిన. సర్వాధికుండాంధ్రపూర్ణుండు. తన్నిష్ఠతనకౌసంగుమని నిన్ను ప్రార్థించిన దత్వయాథాత్మ్యనిర్ణేతివంవరయోగిత్వన్నామమంత్రకృతసర్వహితోపదేష్ట భట్టాధిపయోగి తత్సంబంధపరంపరాచరమావధిదాసుండ. నేనునాభాగ్యప్రభావంబెంతనివర్ణింతు॥ శేషనగరా॥ (౮౦

సరాత్సరమూర్తీ. భూమండలంబున నీవవతరించినప్పుడు కలిసిదాలంగందోలితివి. బాలభావంబుననే మూగకు మాటలాడనోరిచ్చితివి. కౌమారంబున బ్రహ్మరక్షస్సుపాపంబుబాపి ముక్తి యొసంగితివి. శాస్త్రాభ్యాసంబుసేయువేళనృత్యపార్థకల్పకుడైన యాదవప్రకాశుని పక్షంబు శిక్షించితివి వేదాంతపరిచయోదితకాలంబున బ్రహ్మవిద్వందితయామునార్యులకుస్పృహణీయుండవైతివి రంగనాయకులచేత బిలిపించుకొని అతనియొద్ద యువరాజవై నిలిచితివి. తిరుపతులుసేవించుచుబోయి. తిరుక్కురంగుడినంబికి మంత్ర

రత్నంబౌసంగి । సర్వేశ్వరునకు నాచార్యుండవై తివి । దిగ్విజయం బాచరించుసమయంబున శారదచే బొగడికలందితివి । ఇటువంటివి యనేకంబు నీదివ్యచరితంబులు ఒక్కొక్కటె నీకు లోకోన్నతత్వంబు ప్రకటంబుచేసి చాటించగా నితరులుగ్గడించుచుందిరుగనేల । కొండ మీదబెట్టిన మహద్దీపంబొకరుచూపకగాని కనుపించదా॥ శేష॥ (౮౧)

అజ్ఞానత్రయనివర్తకా । హిరణ్య రావణ బాణకంస శిశు పాలాదులు గలుగగా । వారలనుండి భగవంతునిస్థైర్యధైర్య శౌర్య వీర్యపరాక్రమాది గుణంబులు ప్రకాశించినట్లు శంకరభాస్కర యాద వాదికుదృష్టిజైనులు కలుగగా మీసమానాధికరహితవైదుష్యంబును వేదవేదాంతవాక్యార్థవివేచన పాఠంబును । ప్రకాశమయ్యె నీయాకా రంబున । వారుమీప్రభావప్రకటనంబు జేయుటకే జనించినవారైరి గావున । నధికోయోగ్యులుగారనవచ్చునని విచారించు చున్నాడనే॥

శేషనగరాధినాథ॥ ... ... (౮౨)

అమోఘసంకల్పా । కలిగర్వవిజృంభణంబు స్తంభింప జేయ వలయుననితలంపుచున్నవాడవో । దివ్యదేశంబులందు గొన్నిపునరు ద్ధాంతంబులు గావలసెగదాయనియాలోచన సేయుచున్నవాడవో । ఉభయవేదాంత ప్రవచనకర్తలగుదర్శన నిర్వాహకుల సమృద్ధికై యోచనసేయుచున్నవాడవో । శైవమాయావాద బౌద్ధ పాశుప తాది దురతర్క కోలాహలంబడంచుటకు వితర్కించుచున్నవాడవో । జ్ఞానభక్తి సంపన్న మండితంబగు స్వదర్శనంబులో నేరసులురాక యుండనిద్దవలెనని చింతించుచున్నవాడవో । దేహాత్మాభిమాని నీ ప్రముఖ ప్రతికూలవర్గ సమానిత ద్రవ్యంబు స్వీకరించ వలసిగదా యని జుగుప్స సేయు చున్నాడవో । నిజ స్వరూప స్వభావంబు లిప్పు డెవ్వరెఱుంగుదురని గణించు చున్నాడవో । మదీయాచార్య మనో రథనిమిత్తకృతమామక విజ్ఞాపనంబంగీకరించి గోపుర ప్రాకార మం టపాది కల్పనాత్మక సకలవిధ కైంకర్యంబులు గైకొనుటకూహిం చుచున్నాడవో । నీయవసరంబెఱుంగక నీ చిత్తవృత్తిం దెలియకనిన్ను

భిముఖంబు చేసుకొన్నవాని వలె నప్పుడు తోచినందు వలన విన్నపం
బుసేయుచున్న వాడును నిది యసహ్యమైతోచదుగదా। నీవుక్షమా
గుణనిధివి। నేనైతే బాలుండను। అనభిజ్ఞుండను। యీదృశాపరాధ
శతంబులు ప్రతిక్షణంబున నపరిమితంబులుగా జేయుచున్నాడ। నెటు
వలెనో రెచ్చెదవో ॥శేషనగరాధినాథ॥ ... ... (౮౩)

పావనభవ్యనామా। యిలయాళ్వారే। లక్ష్మణాచార్యా। యతి
కులచంద్రా, ఉడయవరే। యెంబెరుమానారే। శ్రీభాష్యకారా। శేషా
వతారా। శఠగోపంపొన్నడీ। అని యెడు తిరునామంబులు మీకు
ముఖ్యవాచకంబయిన చతురాక్షరినిగూడి నవసంఖ్యతో భూమి
యందు వెలసె। ఆశ్రితులన పాపకర్మంబులంబాపి యభీష్టంబులిచ్చు
టకు సమర్థంబులై యున్నవి। ఇదేమాకు బద్మరాగమౌక్తిక ప్రవాళ
మరకత పుష్యరాగ వజ్రమహేంద్రనీలవైడూర్య గోమేధికనవరత్నం
బులు। ఇదే పద్మమహా పద్మశంఖ మకరకచ్ఛపము కుందనీలవరాఖ్య
నవనిధానంబులు। యికమా దారిద్ర్యాది దోషంబులుదొలంగె। దాస
బృందంబెల్ల ననన్య ప్రయోజన పరతత్వంబున వెలింగె, అసన్మాన
సంబులనాత్మసమస్త కామంబులై చెలంగె॥ శేషనగరాధినాథ॥(౮౪)

యతీంద్రా, నీవున్నచోటు త్రిదివంబు। నీయొద్ది భూసురగణం
బమరగణంబు నీయాస్థానమంటపంబు సుధర్మాఖ్యసభ। నీపై భక్తి
కామధేనువు। నీమంత్రంబే చింతామణి, బ్రహ్మసూత్రధారులు వేశ్వర
నీసూక్తి పరంపరల నుపన్యసించి చూపగా జూచుట। రంభాదులనా
ట్యంబుగన్గొనుట। ఉచిత సమయంబుల భక్తి పరవశుల నీపై సంకీ
ర్తనంబులు పాడగా నాకర్ణించుట గంధర్వగానం బాలించుట,
భవ్య దివ్య ప్రబంధీకృత భవచ్చారిత్ర పర్యాలోచనలు చేసిచొ
క్కుట, పారిజాత మందార హరిచందన సంతానకల్పకామర తరు
వాటివిహరణ విలాసంబందుట। నీ తీర్థప్రసాదంబులుపయోగించుట
అమృతంబుగ్రోలుట। నీ పరిచర్యలతో మెలంగుట। సుఖంబనుభవిం
చుట। యిట్లు నీ పరిసరంబున యాదవాత్మభావియైన మహాభాసం

దంబనుభవించు దాసులకు బతన భీతి విశిష్టదైత్య దానవాంతక సం
కలితా ప్రాకృతానిత్యస్వర్గంబసారంబై కనుపించుట చోద్యమా॥ శే॥

వరమప్రాప్యభూతా! సర్వేశ్వరుఁ డకుగల శుద్ధసత్వ మిశ్రస!
త్వాత్మకంబులైన విభూతులు రెండు! ఆ రెంటియందు మిశ్రసత్వం
బతనికి విలోపకరణంబట! శుద్ధసత్వంబు భోగోపకరణంబట! యీయిరు
భయస్వభావంబులు దెలిసినతత్వవేత్తలిబ్విభూతి హేయంబనియువ్విభూ
తియుపాధేయంబనియునివ్విధ బుననుపన్యసి చిరిగాని!విచారించినశుద్ధ
సత్వంబునలెమిశ్రసత్వమున్న తనికిశరీరమేయగుగావున హేయంబనివె
రతుశుద్ధసత్వంబుపాసక ప్రపన్నసముదాయసాధారణ స్థానంబుగనుక
రుచింపదేమిసేతునింత విచారించ నాకేమిటికి! ప్రపన్నుడనుగాను
ఉపాసకుండన మొదలనేగాను! నీ యభిమానాంత ర్భూతుండనైన
దాస్యవృత్తివాడను నేను! వన్నెలుకొన్న యుభయ విభూతీశ్వరుండ
వునీవు! నీయంఘ్రికమల యుగళంబెనాకిరవగు పరమపదంబు! నిర్హే
తుకంబైన నీ కారుణ్యంబే తత్ప్రాపకంబు! త్వన్ముఖవికాసావహకైం
కర్యానువర్తనంబె నాముక్తి సుఖంబు! శేషనగరాధినాథ॥ (౮౬)

ఆశ్రితాపన్నివారకా! సంసారంబనాదిగావున జన్మంబు లసం
ఖ్యాతంబులు! తత్తజ్జన్మంబులయందు చేసినకర్మంబు లనంతంబు!
లేతత్కర్మానుభవ నిమిత్త సంప్రాప్త తాపత్రయాభి సంతప్తంబు
నాహృదయంబు! అందునీవే వసతిగొనుకొని నిలిచియున్న వాడవు!
నీ దివ్యమంగళ విగ్రహంబతి సుకుమారంబు! యెటువలె సహించి
యందుండ గలనని నీ నిమిత్తంబు తల్లడించుచున్న వాడను! నాకొ
అకు జింతచేయనదినాకు సహజమే! నీవు సుఖించవలసియైన నాతా
పంబులుడిపి చల్లజేయుమా॥ శేషనగరాధినాథ॥ ...(౮౭)

వాత్సల్యజలధీ! త్వదీయ దివ్యమంగళ విగ్రహవిషయ , సౌకు
మార్యాదిజ్ఞానంబులేని బాల్యంబునం జపలుండనై నాయక్కరలే
చూచుకొని అపత్సమయంబుల రమ్మా రమ్మని నిన్ను ప్రార్థించితి:

అప్పుడెల్ల గోవత్సన్యాయంబున నత్యంత వ్యామోహాతిరేకంబుతోడ విజయంబుచేసి కటాక్షించి యూరడించితివి. నీకెంత శ్రమంబు గనుపించెనో. నేనెంత కఠినమానసుండను. అపరాధిని నికృష్టుండను. ఇపుడటువలెనే నీవుగావలెనని చాపల్యంబు నాప్పులతో రచ్చవెట్టి దూరుచున్నవాడను. నాయజ్ఞానంబెంతని గణింతునే. శేషసగ॥(౨౪)

క్షమాగుణనిధీ. సంప్రదాయార్థరాశి నిర్భరంబగునీదర్శనంబు నీ బండారంబు. అదినీవు అస్మదాచార్యుల వశంబు చేసినావు. వారనుగ్రహంబున జనియించిన కారణంబున నాకాయిక్కవ గనుపింపజేసిరి. అదినే దాచనేరక నావంటి వంచకులతో సహవసించి బయలుచేసి నీ భండారంబునకు ద్రోహంబు చేసితి. నీచిత్తంబునకు గలకపుట్టించితి. నీ కాయాస విచారంబులు సంపాదించితి. నేనాజ్ఞార్హుండను బుగుల దండనీయుండను. నీవిందుకెంత చేయించిన చెల్లుబడియే. అయినను రాజపుత్రాపరాధన్యాయంబున లఘుదండనంబు చేయదలచినవాడనై కాబోలు. నీసన్నిధిసేవకెడ గాపి యీ దూరదేశంబున బడవేసితివి. ఇక నీచిత్తము. నాభాగ్యము. ఇటువంటి నన్ను మన్నించి యేలుకొన్నప్పుడుకదా నీకీర్తి నానాలోకవిఖ్యాతంబగు నాస్వామీ॥ శేష॥ (౨౫)

అసంఖ్యేయకళ్యాణ గుణగణోజ్జ్వలా. నేజేయునపరాధంబులోర్వగా నిన్ను క్షమావంతునిగా దెలిసితి. నాదోషంబు లింపుచేసుకొనంగా నిన్ను వాత్సల్యవంతునిగా నెఱిగిరి. నామాలిన్యంబు తొలగించగా నిన్ను శుచియని నిశ్చయించిరి. నిరవధికదుఃఖనైన నాదుఃఖంబులు బాపగా నిన్ను దయావంతునిగా నెంచిరి. అతిహేయుడనైన నాకు నంతర్యామివయ్యు నిర్మలుండవై యుండగా నిన్ను హేయప్రత్యనీకుండనిరి. నాకు వలసిన పురుషార్థములన్నియు నీవలనే లభించినవి గనుక. నిన్ను మహోదారుండని వర్ణించిరి. ఇవ్విధంబున నాగుణంబులనుండి నీగుణంబులు గుప్పున గనుపించినట్లు మెఱుగెక్కించి చిలి

చేసిన పనివాడను। నన్ను తొలఁగిపోనీయక నీకోలువునకు నింపుకో
నుము॥ నావంటి పనివాడు నీసముఖంబుననుండిననీకుగీర్తిసుమీ ॥ శ్లో॥
(౬౦)

సత్యప్రతిజ్ఞా। యెటువంటిపాతకినైననుబట్టి నిష్కళంకునిజేసి
నీయొద్దకిదెత్తునని పరవాసుదేవునితో బంతగించి వచ్చితివట। నేడు
నన్నుండినీకు దత్పరిత్రాణసమయంబబ్బె। యేలాగంటివా! వివరించెద।
ప్రతి బ్రహ్మాండసృష్టియందు ననంతకోటి బ్రహ్మలస్మదపార పాపాను
గుణంబుగానా నాయోనులంబుట్టించి వేసటనొందిపోయిరి- దండించి
దండించిరోసి దండధరుల సంఖ్యాతంబుగా బెడువడి విడిచిరి - కల్ప
కల్పంబుల రక్షించజూసి సర్వేశ్వరుండనంతావతారంబులంది యది
చేతగాక చాలించెను - యీ యందంబున నరవిందసంభవాది బృందా
రకాగ్రగణ్యుల నందరి గెలిచి యెదురులేక భూతభవిష్యద్వర్త
మాన పాతకులలో సమానాధికరహితుండనై తిరుగుచున్న వాడను
నన్నిటువంటి వానిగా దెలిసి తెలిసి నీవు ధరాతలంబున మహాభూత
నగరంబులో విభవావతారంబుచేసి - దిగ్విజయ వ్యాజంబున భూమి
నెల్ల బరవంబెట్టి వెదకి వెదకి నూటయిరువది సంవత్సరంబులు పొంచి
తివి - నాడునన్ను దొరికించుకొంటివా। యిట్టివెతల నే యేరూపం
బుల బట్టితలంచితివో నేనగుపడితినా। నేడిట్లర్చావతారరూపంబున నిల్లిం
దల వేంకటాచార్యులకిష్టదైవంబై నిలిచినన్నతనిగర్భంబునజనియింప
జేసిన కారణంబున నతడు పట్టితెచ్చి నీకొప్పగించె। ఆ సంతోషం
బున నే తొడిబడి విచారించక నాకు నీకు పేరిచ్చితివి నీవాడననిపించి
తివి। ఇప్పటికిని నాపూర్వవృత్తి విడిచిన వాడనుగానుసుమీ। అకృ
త్యకరణ కృత్యాకరణ భగవదపచారాసహ్యాపచారరూప నానావిధా
నంతాపచారంబుల పారంబుగా నాచరించుచున్న వాడను। మును
పందఱిని గెలిచినట్లు నేనే గెల్తునో। కాక నన్ను మోక్షార్హునిం
జేసి రక్షించి నీవే గెల్తువో। యీ వినోదంబు శేషాసనాది నిత్యసూరు
లవలోకించుచున్నారు। వారలనాలోకించు పరాకు పనికాదు ॥ శ్లో॥ (౬౧

సాధుజనాగ్రగణ్యా ! సర్వేశ్వరుని నేనెడబాయని చెలికాడ
నైయుండి. అతడును నేనును నొక పిప్పలవృక్షంబా శ్రయించితిమి
తసన్మాలంబున నేమో తెలియదతనితో నాకుముళ్లబాటు ఘటించె.
అతడును నాతో బోరం దొడంగెనయితే నేమి ఛేదన దహన భేదన
శోషణాదులు నన్నంట్లని మహా మహిమగద్దుగావున నన్నతనికి చెప్ప
రాదయ్యె. చెప్పరాని పని గెల్వరాదు గనుక ఆమార్గంబువిడచి
నృసింహ రామకృష్ణాది వేషంబులు దాల్చివచ్చి నన్ను లోబరుచు
కొదలంచె తలచి నప్పుడు నేను దేవతిర్యఙ్మనుష్యస్థావరాద్యవాంతర
భేదచిత్ర విచిత్ర రూపంబుల నంది. లోపడక సరిపోరగా బోరగా
ననంతకోటికల్పంబులిట్లాగునజరిగె గాని నన్నతడు గెల్వలేడయ్యె.
నేనిటువంటిదురహంకార మహావీరాగ్రగణ్యుండను నది నానాలోక
ప్రసిద్ధంబు । దేవరకుం దెలిసినదె కదా । సర్వజ్ఞశిరోమణీ । ధార్మిక
చక్రవర్తిగనుక యీకారణంబునకు గారణంబేమని వెదకి । తత్ఫల
సమాశ్రయణాంబున సంప్రాప్తంబైన దురహంకారంబే బేతాళా
వేశంబనికని । యీయిక్కువ నీవు దెలుపగా దెలిసి సర్వేశ్వరుండిది
శౌర్యాదిగుణంబులతో బనిగాదని వాత్సల్యసౌశీల్య సౌలభ్యాద్యన
వరఃశిష్ట కారుణ్యగుణ సహాయంబున పిల్లిందల వేంకటాచార్యరూపం
బునవచ్చి అస్మజ్జనకుండైన పితాపుత్రసంబంధ ప్రయుక్త స్నేహం
బున గారపించి । చేరదీసిమూలమంత్రమూలంబుగా దదావేశంబు
దొలగించి । దాసుని నేలిసీసొమ్ము చేసెగదా । యిపుడుదురాచారు
లతో సంగతివచ్చినప్పుడంతయుదత్స్వభావంబు గనుపించుచున్నది।
నీవేమరియుండగూడదు । తదావేశంబు చేసి సన్నిధినేయుంచుకొని
కీర్తివహించుమని॥ శేష॥ (౯—౨)

అకర్మవశ్యాదిచ్ఛావతార । సంస్కృత ద్రవిడశబ్దనుయోభ
య వేదాంతంబులయందు ప్రాథమిక వేదాంతపథంబు నిష్కంటకంబు
చేయుటకొఱకు సారసంగ్రహదీపభాష్యాది గ్రంథవిరచనంబులొనరించి
యూపదాయుష్యమును దత్ప్రవచనంబేచేసితి । ఆటువలెనేద్రవిడోప

నిగమమార్గంబు పరిపాలనంబు సేయువలసి మీ రేవరవరమునిరూపంబున వెలసి యావదాయుష్యమును దద్వ్యాఖ్యాన తాత్పర్యభూతాశేష రహస్య వివరణంబులనే ప్రవచనంబు సేయగా నుభయ వేదాంతంబులు మీ చేతనే ప్రతిష్ఠితంబులయ్యె శేషావతారంబగుచు మీరే వరవరమునులగుట నిస్సందేహంబగుటకు పూర్వరామానుజరూపంబున కనంతరంబగుబల రామరూపంబు శ్వేతవర్ణంబైన క ణిని దద్విగ్రహంబును సుధాకరధవళవర్ణంబు చేసుకొని యావిర్భవించుటకు సాక్షిగదా। శేషనగరాధినాథ॥ ... (౯౩)

అతిమానుషావతారా। స్వావిర్భావవిశేష వరవరమునిరూపకరిష్యమాణ ద్రవిడ వేదతదంగోపాంగత ద్వ్యాఖ్యాన తదభిప్రాయభూతాశేషరహస్య తద్వివరణప్రవచనాత్మకజీవనాప్రవర్ధితానేకముముక్షుజనబుద్ధి సస్యంబులకు నిరుపద్రవరక్షచేయు తలంపునగదా వేదభారభరాక్రాంత బాడబావశాదనిహీనజ తుజాలంబునకు నిరవకాశంబుగా దావకవిభవావతార సమయంబుననే సారసంగ్రహదీపభాష్యాదిగ్రంథమయావరణ నిర్మాణంబు చేసితిగి। అటులనే మీ కృషి ఫలించె। శోకము బుట్టెడు మోక్షంబయ్యెనింక నందఱమును బ్రతికితిమి। సర్వేశ్వరుండగు పరవాసుదేవుని తిరుమామణి మంటపంబను పెనుకణజంబు నిండి వెల్లివిరిసె। యీకీర్తి నానావైకుంఠంబులందు వెలయుభళిభళీ। శేషనగరాధినాథ। ... ... (౯౪)

కలికలుషవిరోధీ। నీవవనీతలంబున నవతరించి చేతనులనందఱిని భగవదభిముఖులగా నొనర్చి మోక్షమార్గమందు నన్వయింపించిన కారణంబున యూతినా శరీరార్థులు లేమి గనుపించి యామ్యాది మార్గయాయి చేతనజాతంబు లేక తత్పదంబు వాడికప్పి పాడై నువ్వు మొలిచె। ఘాతకీయమ ధూతభీకర భాషితార్పణ కలకంబు కరువయ్యె నరకకూపంబుల రూపంబు లేవులు దప్పి చిత్రగుప్తులు వ్రాతలుదక్కి ద్యూతాదివిహారంబులచే బ్రొద్దులు జరుపం దొడంగిరి। అంతకుండే వేళ జూచిన నంతఃపుర కేళీలోలుండై పారుపత్యంబునకు బాసియుండె।

ఇవ్విథంబునయమరాజధా నిస్ఫురణంబుదగిగివిన్నవయ్యె । నీతంత్ర కౌశలంబంతకుని వీడుపాడుచేసె । యెంతనిగణింతునీవింత॥ శేషనగ॥ (౫౫)

సకలభువనమాన్యా । తావకచరణారవింద సంబంధంబుగల జీవులసంఖ్యాతంబుగా బరమపదమార్గంబుపట్టి పరువనడచినబ్లెడవ కనడువగా । వారలువీరలనేసత్కరించిన వారుగనుక । సప్తార్చిర్దినపూర్వపక్షోత్తరరాయణ సంవత్సరాభిమాని దేవతాసమీరసహకర చంద్రవిద్యుద్వరుణశతముఖచతురుఖులకు నేతన్మకాత్మ వరంపరావిషయ నిరంతరసత్కారంబులు చేయవలసిన యక్కరలచేతసందడిపడినిజనిజాధికారోచిత కార్యాచరణంబులకు గాలంబుదొరకదయ్యె । ఈచందంబుననీ యాజ్ఞాపరతంత్రులై బ్రహ్మేంద్రాది దేవతలు భాగవతకైంకర్యంబన్వయించి నీకు ముఖోల్లాసము సేయుచు బ్రవర్తించుచున్నారేమనవచ్చునే। శేషనగరాధినాథ॥ ... (౫౬)

దేశికసార్వభౌమా । వటుతర గ్రహణధారణాదివిశిష్ట శేముషినీకుబట్టపుమహిషి । గురుపదంబుసింహాసనంబు । సిద్ధిత్రయపురుషనిర్ణయాదులాయుధంబులు । విరజకవ్వలవ్వలిసీమలు నీయేలుబడికివచ్చిన దేశంబులు । శ్రీరంగక్షీరసాగర శ్వేతద్వీపంబులుజలదుర్గంబులు వనశైల వేంకటశిలోచ్చయ వారణమహీధర గారుడగ్రావ నారాయణాచలంబులుగిరిదుర్గంబులు । తక్కినదివ్యదేశంబులెల్ల స్థలదుర్గంబులు। కులదైవంబుకురుకానగరాధిదేవత । తదారాధనచేయు వైష్ణవుడుమధురకవియాళ్వారు పోషించదగిన కులవృద్ధులభూతసరోవరమహదాదిసత్యసూరులు । జాతకమునిశ్చయించిన సిద్ధాంతిశ్రీమన్నాథమాని । పురోహితుడైన కులగురువు ఆళవందారు । నిత్యచరణతీర్థ ప్రసిద్ధుడు పెరియనంబిగారు । విజ్ఞాపితకరమాలాధరులు విద్యాభ్యాసము చేయించిన ఉపాధ్యాయులు । పురాణవక్త శ్రీశైలపూర్ణుడు । అవసరమైనప్పుడర్థమిచ్చి పుచ్చుకొననేర్చిన మహాధన్యుడుగోష్ఠీపూర్ణుడు। హితాహితములు దెలుపగలవైద్యుండమ్మంగి । మంత్రాలోచనకర్తయగు

మంత్రితిరుకచ్చినంబి । దళవాయిదాశరథిసూరి , రాయసముద్రాయు
చతురుడు శ్రీవత్సాంకమిశ్రుడు । తత్పుత్రులు ముక్తాతపత్రచామర
ములు । తదుపదేష్టమణిమయ పాదుకాయుగళీకురుకాధినాథసూరి
సంప్రతినాయకుడు వడుగునంబి , బొక్కసకర్త తిరువరంగత్తముధ
నారు । పట్టపుకవీశ్వరుడు గోవిందవరదరామానుజమూని । కొలువు
విద్వాంసులు మైమర్దనచేసెడు సముఖముజట్లుపిళ్ళయురంగావెల్లి
దాసులు । జలకము చేయించు వెరవరికందాడయాండాను । కట్టు
వర్గమిచ్చు పరిశుద్ధుడు యేచ్చాను । మీకడుబసీ సహస్రకమలమణి
మాలికా తిరుమణి శ్రీచూర్ణంబులు సమర్పించువారు పిళ్ళ పిళ్ళయా
ళ్వాను । పరిమళముగట్టించుజాణ అనంతళ్వాను సువారపుచేరువకాడు
కిందాబి యాచ్చాను । అండాళుం బొన్నాచ్చి కూరును నివాళులిచ్చు
పుణ్యసతులు । పత్ని కొళ్ళయమ్మాళు దేవియారును । కొంగువాయ
కియు బళ్ళెరములుపట్టి వడ్డించుదాదులు । సంగీతవిద్యారశికుండరంగ
మూళి । చతుస్సప్తతిసింహాసనస్థగురుని జరసప్తశతత్రిదండ సన్న్యాస
బృంద ద్వాదశసహస్రైకాంతిజరా సంఖ్యాత శ్రీవైష్ణవయోధంబులు
క్రమముగారథగజాశ్వపదాతిరూప చతురంగబలంబులు । వేదాంత
వేద్యకలిజిత్కింకర సుదర్శనభట్టారక కృష్ణద్వయతత్కుమారవాది
కేసరీప్రముఖులు కార్యకర్తలైన యూధనాథులు । వరవరయోగి
శుద్ధాంతరక్షకుడు । సర్వతంత్రస్వతంత్ర పుత్రులునుసూత్రధారవంది
మాగధులు। పావడలు వేయువారు। బరాబరులుసేయువారు। పరాకు
దెల్పువారు। ప్రతిహారులు। పాణిదీపగ్రాహులు। మొదలయిన పరి
చారకులు భక్తవరులగు నామధారులు। అన్యమతస్థులందఱును నీ
మూకలచేత బరాజితులై దాగికనుపించకపోయిన శత్రురాజులు।
యీ శేషనగరంబునీకిరవగురాజధాని। నీవిటువంటి మహాప్రభుత్వము
గలరాయలదేవుడవని నిన్నుబొడగని నీవుజేయు సన్మానంబులు
గైకొని। నీకొలువునకునిలచిన కవీశ్వరులు మా పెద్దలు। నేనువారి
వాడనుగనుక నీ పాదములకు దగులైనవాడనే। యెంతపనికిని నన్ను

విడనాడక రక్షించుటసీకుగీర్తుసుమీ॥ శేషనగరాధినాథ .... (౬౭)

ధర్మసంస్థాపకా! పెంటమీఁదిపేలికమైనా కాలికిగట్టి అది బిరుదనుకొని కాదన్న చో నదివిడువక నిర్వహించుకొని బిరుదుగానే సమర్థింతురట। తమవాకిటసార మేయంబును బరులు నొప్పించినచో నాగ్రహించి వారివారిపగసాధింతురటకాని విడువరట। దొరపాటి వాఁడు తనబానిసనన్యులవమానించినఁజూచియోర్వలేక తన ప్రాణ పర్యంతంబోడబడి కీర్తిఘటించుకొనునట। మంటిదయినను మాయొద్దే గెల్వవలెననులోకోక్తి యున్నటువలెనేగదా। యిటులైనప్పుడు నేను నిన్నంటినవాఁడనేగదా। నీవునన్నేలినవాఁడవుగావా। నీముందర నేనన్ని తరులనాదరించగా జూచుచునూరకయుండ నీకదియుచితమేనా। అది యటుండనిమ్ము। తొల్లి రాముఁడులూకంబుబల్కులాలకించి తగవు దీర్చెనట నీవతనితమ్ముఁడవే కావా। ధర్మజ్ఞుండవు సత్యసంధుఁడవు। నే జేయునూడిగంబుల కడ్డపడువారిని గనుంగొనని చందబున నూరకొన్నాఁడ వేమియుననవు వారికినినాకుందగవైన వగదెగజేయు మీ యాగడమా॥ శేషనగరాధిరాథ॥ (౬౮)

అఘటితఘటనైకనిపుణా! చిత్రకూటంబువిడచివచ్చినగోవింద రాజులను దిరుపతిలో బ్రతిష్టచేసి। అతనినతిశయితభాగ్యవంతునిగా జేయందలంచి। గోనామంబునవ్యూహలక్ష్మిప్రతిష్టయొనర్చి। ఆ వాహ నంబైనవెంబడినతనిదదగ్ర కటాక్షపాత్రునిగా నిలిపి సంపన్నుని జేసితి వట। ఆవింతయటుండనిమ్ము। ఆ గోవిందునికి శేషాచలపతి తమ్ము డనుకొని తన పరిజనపరిచ్ఛదబృందం బెల్లందధీనంబు జేయుచు వర్తించు వింతయేమి। ఆతండేయూరు। తానేయూరు। ఆ యిరువురి చేష్టితంబు లందలపోసిచూచిన నొకరునీయభిమానాంతర్భావంబాశించి వచ్చిన తీరునైయున్నది। పాషండసంసర్గమసహ్యమైలోచి వచ్చినలాగునై యున్నది। యొకఁడు నీవు శంఖచక్రాంకణప్రదుండవని నీహృదయం బనువర్తించినడిచి శిష్యవృత్తిజూపుచందంబుననైయున్నది। కృతజ్ఞత చేత బ్రత్యుపకారముంజేసిన చందముగనే యున్నది। అటననేల

యిటననేల। యెటంటేయేమో। నాకేమిటికి। నేను బంటుగాడను। మీభావంబును మీకే తెలియును। శేష॥

ఆప్తజన భీష్టగంధాయుకా। ప్రకృతానుసారిగా నొకటి విన్నవించెదవినవధరింపుము। తిరుమలతిరుపతులు నీయధీనంబులై తదధిష్ఠితదైవంబులు నీయభిమాన విశేషబలంబునం జెలంగువారుగనుక। అచట గోదాసంజ్ఞకవ్యూహలక్ష్మీవిగ్రహంబును బ్రతిష్ఠజేయించి మీ శేషనగరంబునకు దెమ్మని దేవరవారుదాసునికి నియమించగా దత్ప్రకారంబున దిరుపతియందు విగ్రహనిర్మాణంబు చేయించి। తిరుచానూర నలమేలుమంగా సన్నిధానంబున బ్రతిష్ఠజేయుటకై తిరుమలయందర్చకముఖంబున సన్నిధి ననుగ్రహంబున సన్నిధిసంబడసి। శాలివాహన శకవర్షంబులు వేయిన్నూర్ధు నూటపదునాలుగోవది యగు ప్రజోత్పత్తినామసంవత్సర ఫాల్గునశుద్ధ యేకాదశిగురువారంతోఁ గూడిన పునర్వసునక్షత్రమందు మీనలగ్నంబున నావాహనంబు గావింపజేసి విజయంబుసేయించుకొని వచ్చినప్పుడు। పూర్వమందు స్వప్రతిష్ఠాపితవ్యూహలక్ష్మీసంబంధంబు గోవిందరాజులకునువలె మీకు దిరువారాధనంబగు వీథియార్ వరువారికిని నీలక్ష్మీసంబంధంబు భాగ్యంబులు రాగలవని కనిపించియున్నది। యీ వ్యూహలక్ష్మికి బుట్టినిల్లు తిరుచానూరేయవుటచేత నలమేలుమంగయక్కయుండా జెల్లెలుగనుక శేషనగరనివాసులగు కోనేటిరాయడు, గోపాలరాయడు తోడియల్లుండ్రైరి। యింత బలిమియున్నప్పుడన్ని విభవంబులును నంతట తానే వచ్చును। తిరుపతిచందంబున మనియగాండ్రచేతి బాధలంటి। విభవము మాత్రమే రానీయకు రానీయకునిదినామనవి। కోవెల శ్రీవైష్ణవుల యధీనంబుజేసి సమస్తైశ్వర్యంబులును గలుగ జేయుము। అఖిలాచారపురుషులకును నిదేయభిమతంబు మరచెదుసుమీ॥ శేషన॥ (౧౦౦)

నమజ్జనమనోరథప్రపూర్ణ। జ్ఞానమంటపంబగు తిరునారాయణపురంబునందు సంపత్కుమారులకైంకర్యంబుచేయువారలు నే

బడి యిద్దరు స్వశిష్యుల నెళవుచేసిపిలిపి। మగుడ శ్రీరంగంబునకు బైన
మైనతరిసి। మీవి క్షేమంబునకోర్వజాలనివారి పరమభక్తి దశ నవగా
హించి। స్వాకృతి ప్రకృతికినియమించి। నిర్మాణశాలయందు దద్వి
గ్రహ భుజగద్వయంబుననిలిపి శంఖుచక్ర లేఖాలేఖనంబు జేయుము
హూర్తంబు దేమతంబులో గోష్టిమధ్యమున హస్తాత్కరతలంబులు
భుజమూలంబుల గప్పుకొని నాడే పెరియనంబిగారు కృపచేసిరి।
నేడేలతిరియ యానతిచ్చితదాకారంబునా తాత్వాకారంబేయనుటకు
నిస్సంశయంబుచేసి పూర్ణనిర్మాణ సమనంతరంబున నాలింగన
ద్వారాస్వశక్త్యావాహనమున నొనర్చి। వారికినమ్మిక పుట్టించుకొరకు
దద్విగ్రహంబందుండె। ప్రత్యుత్తరంబుగ్గ లించినగతి గనుపింపజేసి
వారిని సమ్మతిం పించిరట। యిందుచే దస్వయంవ్యక్తంబైన యందం
బై కనుపించె। మోక్షదశనంబె విజ్ఞాన విభుత్వముం బ్రత్యక్ష
మయ్యె॥ శేషనగరాధినాథ॥ ... ... (౧౧)

అసంచిదజ్ఞానస్వైభవ- స్వయ వ్యక్త దైవ సైంధ మానుష
భేదంబున భగవంతునకు జతుర్విధంబులగు సర్వావతారంబుల వలెనే
మీయర్చారూపంబులు దత్ప్రకారంబున జతుర్విధంబులయ్యె నదె
ట్లన్న। నారాయణాచలంబు నందాత్మ సంకల్ప కల్పితరూపంబున
స్వయమేవ యావహించుటంజేసి। అదిస్వయంవ్యక్తంబు। శ్రీరంగంబున
భవద్వియోగాసహిష్ణు తద్వల్లభ విష్ణు ప్రతిష్ఠాపిత రూపంబగుట
నదిదివ్యంబు। శ్రీ మహాభూతనగర శ్రీ వెంకటాచలంబుల సమకాల
మందే సర్వతపోతిరిక్తన్యాసాఖ్య తపస్సిద్ధి మహర్షి ప్రతీకాశ దాశ
రథికుమారానంత సూరివర ప్రపన్న కృతరూపంబులు గనుక॥ అవి
సైంధవంబులు। యీస్థాన చతుష్టయంబు దక్క దక్కిన సమస్తదివ్య
దేశంబులందు నిందునుంగల దివ్యరూపంబులతో డగూడ ముందర
కల్ప పర్యంతమును భక్తిమూలంబులై ప్రతిష్ఠాపితంబులు గాగల
రూపంబులెల్ల మానుషంబులు॥ శేషనగరాధినాథ॥ (౧౨)

రంగనాథప్రియా। ఉభయ విభూతినాయకత్వాధికారం బొసం

గిరంగనాయకులు మీకు గాలత్రయవాస యోగ్య బుగా నగరత్రయంబు మొదలనే సంకల్పించెనని నానూనసంబున విచారించినంగను పించె। అదెట్లంటివా విననవధరింపుము। అవతార దేశంబగుట చేత బాల్యాతిక్రమణ పర్యంతవాసయోగ్యంబయ్యె। గాన శ్రీమహాభూత నగరంబు స్వదత్తభూతిద్వయ నిర్వాహణంబు జేయుకొరకుగల్ప పర్యంతము విడివడుచోట శేషనగరంబేయని శ్రీరంగ రాజాభిప్రాయంబుగా దెలిసిననాడే మీరచటికి రాదలంచినంగని। యావచ్ఛరీర పాదమత్రైవ శ్రీరంగే సుఖమాస్వయని యతడే నియమించెగావున। అర్చావతార భావాంగీకార పర్యంతం బటువలెనే వర్తించుటం జేసి। రంగనగరంబు వర్తమాన నగరంబై తత్కాలంబునకు నీ శేషనగరంబు భవిష్యన్నగరంబయ్యె। అందుకు మీరీకాలంబున బరిపూర్ణవ్యాప్తిచేత దివ్యశక్తి గనుపింపజేసి శ్రీ మహాభూతనగర శ్రీరంగనగరంబులవలె నఖిలగురుజనోద్దేశ్యంబగునట్లుగా ప్రభావంబు చూపుచున్నచోట వర్తించుచున్నాడవు గనుక అదే సిద్ధమని తెలిసెనే। శేష। (౧౦౩)

భక్తచింతామణీ। వైకుంఠ క్షీరసాగర శ్రీరంగవారణాచల వేంకటశైలవనగిరి ప్రముఖస్థలంబులు శ్రీయఃపతికి వాహనస్థానంబులని పెద్దలందఱు నందరు। అతడా దివ్యదేశంబులతో గూడవచ్చి నీ యంతరంగంబులో ప్రవేశించియున్నవాడు।అట్లునిన్నొకమాఱు సేవించి ప్రదక్షిణంబు చేసినమాత్రంబుననన్నితీర్థపతుల యాత్రాఫలంబులును నీకిరవగు శేషనగరంబై యొసంగలదచట వసించిన సుజనుల పుణ్యంబులగణ్యంబులహో॥ శేషనగరాధినాథ॥ ... ... (౧౦౪)

అపారకరుణాంబుధీ! అసద్వస్తువునైన నాయందు అకారణ సహార్ద్రముంచి జాయమానకాలంబున గటాక్షించి జననాంతరంబున రామానుజార్యులని పేరుపెట్టనియమించిస్వకీయతాభిమానంబు నబోషించి। సన్నిధికిరప్పించుకొని పేరొప్పగింపజేసుకొంటివి। ఉపనీతునిగాజూచి పంచసంస్కారసంపత్తికై పరవస్తుకులసాగావారకా

శుభంబగు తిరువాయ్ మొళ్ళిప్పెరుమాళ్ వై వారునాశ్రయింప జేసితివి। గృహస్థభాంబునందించి నీవే తండ్రివై కృపామాత్ర పసన్నాచార్యత్వంబున నఖిల సంప్రదాయార్థంబులెల్ల దెలిపి నిజశక్తి నాయందేనిలిపి। అంతరాత్మవై దాసులకు దాసునిగ జేసుకొంటివి నీ విషయంబు గానాంధ్రగీర్వాణ ద్రావిడ కర్ణాటాది భాషామయంబులైన గద్యపద్యంబులచేత సంకీర్తనాత్మకానేకకృతులు వెళ్ళనాడు- బుద్ధియిచ్చి వాచకంబును నీకే శేషంబు జేసుకొంటివి నీ యూడిగ పనులకలశరచి కాయకంబును వినియోగించుకొంటివి। నావా వృద్ధులులనన్నంటనీయక నీదిగా జేసుకొని విహరించుచున్నావు నాకేమిచింత నీవెటువలె నాడింతువటువలెనాడ గలవాడను। యిది యథార్థముయథార్థము॥ శేషనగరాధినాథ ... (౧౦౪)

ఆనందస్వరూపా। యిన్ని విన్నపంబులకుదలకట్టయిన విన్నపంబొక్కటి విన్నవించెద। యే దేశంబుల నయిన గలుగసంకల్పింపుము। యేదుఃఖంబులనయిన బెట్టుము। అందు కేమియును వెరువ। నీ దాసులందరు నన్నభిమానించినియమించి నాచే నూడిగంబులుగ్తొకొనునటుల యనుగ్రహించినంజాలు। యిదిలేని యైశ్వర్యంబును గోర నాత్మానుభవమునొల్ల। భగవల్లాభంబయినన పేక్షించను। యిది సత్యంబిందుల కేమిప్రమాణమిమ్మన్ననిచ్చెద। మీ శ్రీపాదంబులాన। శేషనగరాధినాథ రామానుజ॥ ... ... (౧౦౬)

ఆత్మీయజనరక్షణకటాక్షా। నీనగరంబునసుహృజ్జనంబులతో గూడి సంసారదుఃఖం బెరుంగక యావజ్జీవనమును ద్వదీయదివ్య ప్రబంధ పరిశీలనంబులచే గాలంబుగడపజేయుము। మీ వదనచంద్రోదిత మందహాసచంద్రికాపరంపరల నానయనచకోరంబుకబ్బజేసి హర్షింప జేయుము దేవరదివ్యావయవలావణ్యవర్ణనాత్మక మానస సరోవర విహారంబునామనీషాను రాళికలభింపజేయుము। మామక మనోమిళిందంబునకు నిందు తావక చరణారవిందమానమకరందరసాస్వాదంబుగా గరుణింపుము। భవదీయమందిర కైంకర్యంబు లెడపక సవరించుట

కధికారంబొసంగుము. మావారందరు నన్నభిమానించుటకు దద్దయా
పాత్రునిగా నొనర్పుము. వారలయెడల నపచారంబులు ఘటింపక
యుండునట్లు వర్తింపజేయుమీ స్వామీ! శేషనగ రాధినాథ॥ (౧౦౭)

శరణాగతాపరాధాసహిష్ణూ! అడియెకనాత్మగుణ వర్జితుడ.
అనాత్మగుణ పరిపూర్ణుడ. అజ్ఞుడ. తప్పులనక నా విన్నపంబుల నింపు
లుగానంగీకరించి యనుగ్రహింపుము. లోకమందర్భకుల నవ్యక్తభాష
ణంబులు తప్పులుగాగొనక మాతాపితాదులు ముద్దుచేసుకొని
మఱి మఱి వినగాంక్షింతురుగదా. అట్లె నేనును. నీవుపరవస్తు విఖ్యాతి
నొందిన వేంకటాచార్యుల రూపంబమరియున్నవాడవు. రక్షించు తం
డ్రివి. పోషించుతల్లివి. మెచ్చుదొరవి. తోడగుబంధుండవు. జోడగు
మిత్రుండవు. అఖిలంబులునునీవే. నన్ను నీకారుణ్యశీతల కటాక్షా
మృత ధారాపరంపరగముంచి మునీ హృదయంబునా కభిముఖంబుగా
నిమ్ము కైంకర్యవిరోధులబోజిమ్ము. నీ యూడిగంబులు చేయుట
కనుమతి యిచ్చి కైకొమ్ము కైకొని ప్రసన్నుండవుకమ్ము. శేషనగ
రాధి నాథ రామానుజ నమో యతిరాజ శేఖరా ... (౧౦౮)

గద్య.

ఇది శ్రీమద్రామానుజ పదభక్త సేవాధురీణ భగవద్భాగవత
కైంకర్యాభిధానశ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాన్త
ప్రవర్తకారోహణ ప్రవీణ విల్లండల వేంకటాచార్యసత్పుత్ర రామా
నుజాచార్య ప్రణీతంబయిన రామానుజాష్టాశత ప్రబంధి పరికల్పిత
పరవస్తు ప్రకాశ నిఖల ముముక్షు పరంపరా సంపాదిత పరమపద
ప్రాప్తంబగు శ్రీమద్గురు ప్రశంసాధర్మ దాక్ష్యానుకూల శ్రీపాదతీర్థ
తళియప్రసాదాది పరిశవేది ప్రభావసంపన్నంబును, నాథ యామున
పరాంకుశ మహానుభావాది స్తోత్రంబులును, శ్రీరంగ వెంకటాచల
యహోబలాది భగవస్థలనిర్ణయ నిపుణమహాసముద్రిత మహోత్సవం
బులును, శృంగేరి శారదాపీఠ పరవాది మత్తగజంబుల గామాడుజి
నామ సింహావందితంబులును, జైన చార్వాక పాషండమత ఖండనంబు

లును, అజామిళోపాఖ్యానంబును, తింత్రిణి మూలనివాస వకుళాభ రణ ప్రభావ మహా ప్రభావంబులును, శేషనగరంబున రామానుజ నివాసంబును, భూతపురీ నిలయంబును, శ్రీవైష్ణవగణ త్రిదండసన్న్యాససమూహ పరిణామంబును, ఇతర దేవతా దూషణంబును, వాలాయి రప్రబంధాది ద్రావిడ వేద సూత్రంబులును జ్ఞానాధికారుల లక్షణంబులును, భక్తి ప్రపత్తి తదుపాయ మోక్షంబును నన్నది విన్నపము ష్టాశత పరిణామంబులును నైన రామానుజామృతంబునం దేకాశ్వాసము.



శా॥ శ్రీరామానుజ విన్నపాలు సరసుల్ చెన్నొం
దగా నిత్యమున్। సారాచారముగా వివేకమతిగా
సంపూర్ణ సద్భక్తిగా। నోరూరన్ శుచిగాఁబఠిం
చినను నన్యోన్య ప్రవృద్ధంబుగం ఖీరస్వాంతుఁడనం
తసంపదలచేఁ బెంపొందు నిద్ధారుణిన్॥

శ్రీ రామానుజ విన్నపములు.

సమాప్తము.



శ్రీమతే యతిరాజ శేఖరాయ నమః.





ద్రవ్య సహాయకులు :

శ్రీయుత నిడుముక్కల సుబ్బారాయుడుగారు,

విజయవాడ.

గ్రంథ ప్రోత్సాహకులు :

శ్రీ గార్లపాటి కనకానందరావుగారు,

విజయవాడ.



Title Printed at 1949 Copies 1000

శ్రీ సత్యనారాయణ ప్రింటింగు వర్క్సు. విజయవాడ.